OCTOBER - 93

# వనిత

## దీపావళి ప్రత్యేక సంచిక విశేషాలు

కథల విభాగంలో ప్రసిద్ధ రచయిత్రుల కథలు

'నృత్యాంజలి' విభాగంలో ఐదుగురు ప్రసిద్ధ రచయితల రచనలు

ఒక చిన్న నవల

'వ్యాసమంజరి'లో ఉపయుక్తకరమైన వ్యాసాలు

'ఆరోగ్యం' విభాగంలో పిల్లల సంరక్షణలో జాగ్రత్తలు

'వంటలు' విభాగంలో వివిధ రకాల వంటకాలు

'చేతిపనులు' విభాగంలో వివిధ రకాల హస్త కళలు

'సౌందర్యం' విభాగంలో సౌందర్యపోషణకు సంబంధించిన పలు అంశాలు - ఫ్యాషన్లు - ఆభరణాలు

పేజీలు: 180

ఇది కాక ఇంకా మీరు మెచ్చే పలు అంశాలతో, ముస్తాబైన ముఖచిత్రంతో దీపావళి పండుగకు ముందుగానే వెలువడుతుంది!

వెల: రూ. 15/-

ఎకో తో ముఖవైఖరులను తయారుచేయండి!

విషపూరితము కానిది
పూర్తిగా సురక్షితమైనది




ఒక్కసారి ఆలోచించు అదంటే అమ్మ ఎంతగా ఇష్టపడుతుందో.

గెలుచుకోండి వేలకొలది బహుమతులు!

ఉచితం!
కలరింగ్ బుక్
ప్రతి ప్యాక్‌తో.

Ekco®

మీ యంతటు మీరు ప్రదర్శించు
కోవడంలో ఇది ఒక అత్యుత్తమమైన కళ.

ఎకో అంటే అంతులేని వినోదం!



Karishma/SW/6/2016 TL C

వెమికాల్ అద్భుతమైన గమ్
చక్కగా దానితో అతుక్కుపోండి

...మైన బొమ్మలతో చిన్నారి ఇంటిని నిర్మించండి.
...చర్‌తో ఉత్తేజకరంగా తీర్చిదిద్దండి. చిన్నచిన్నవి,
...గా ఉండే రకరకాల జంతువులు, చిత్ర విచిత్రమైన
...ం ముసుగులు-కర్ర, కాగితం, కార్డు బోర్డు, గుడ్డలు...
...ష్టం వచ్చిన వాటితో తయారు చేయండి. సరదాగా
... ఆనందించేందుకు పరిమితులేమి ఉంటాయి. మీ
...లు తప్పిస్తే. ఖాళీ సమయాన్ని ఉల్లాసంగా గడుపుకోండి.

# వెమికాల్®

...ర్ట్ అండ్ క్రాఫ్ట్ ఎడెసివ్

వేమ్ ఆర్గానిక్
కెమికల్స్ లిమిటెడ్

... 85 ... -110019




eacl/153.93 TEL

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : వాగిరెడ్డి





## మతసామరస్యం

చికాగో నగరంలో స్వామి వివేకానంద పాల్గొన్న ప్రపంచ మతాల మహాసభలు జరిగి వంద సంవత్సరాలు పూర్తయింది. 1893 సెప్టెంబర్ 11వ తేదీ ప్రారంభమయిన ఆ సభలలో పాల్గొన్న స్వామి వివేకానంద అందరి దృష్టినీ ఆకర్షించాడు. ఆయన కేవలం హిందూమత ప్రతినిధిగా కాకుండా, మన వేదాలు ప్రభోదించే విశ్వమానవమత ప్రతినిధిగా ఆసభలలో పాల్గొనడమే అందుకు కారణం!



ఆ సభలలో 31వ వక్తగా ఆయన మాట్లాడవలసి వుండగా రెండు మూడుసార్లు తరవాత మాట్లాడతానని సభాధ్యక్షుడు డా॥ జె.హెచ్. బోరోసను కోరాడట వివేకానంద. తీరా లేచి ఉపన్యసించే సరికి – అక్కడ వున్న దాదాపు ఏడు వేలపైచిలుకు శ్రోతలు మంత్రముగ్ధుల్లా లేచి నిలబడి రెండు నిమిషాలకు పైగా చప్పట్లు చరిచి ఆయనను గౌరవించారు!

గంభీరమైన ఆయన రూపం అక్కడి వారిని ఆకర్షించి ఉండవచ్చు. అయితే, ఏ మతాన్ని గాని విమర్శిస్తూ ఆయన నోటి నుంచి ఒక్క మాట రాలేదు. అన్ని మతాలూ ఒకే గమ్యమైన దేవుడి దగ్గరికి మానావాళినినడిపించే విభిన్న మార్గాలని ఆయన ఉపన్యసించడం శ్రోతలను ఆనంద పరవశుల్ని చేసింది. పరమత సహనం, మతసామరస్యం, విశ్వమానవ ప్రేమ ఆయన ఉపన్యాసంలో ఆధారనాదాలుగా వినిపించాయి!

వివేకానందుడి గురించి పత్రికలలో వచ్చే వార్తలనూ, విశేషాలనూ చదివి ఆనందిస్తున్నామే తప్ప, మనం ఆయన అందించిన ఉత్తేజకరమైన సందేశాలను ఆచరిస్తున్నామా అని ఒక్కసారి ఆలోచించి చూడాలి. మత సామరస్యం గురించి మనం గొప్పగా మాట్లాడుతున్నాం. అయితే, మన చుట్టూ జరిగే మతకలహాలను చూస్తూ ఊరుకుంటున్నాము. ఈ విషయంలో మన మనస్తత్వంలో, ధోరణిలో మంచి మార్పు రావాలని ఈ శతవార్షికోత్సవాల సందర్భంగా ఆశిస్తున్నాము.


సంపుటి: 92 అక్టోబర్' 93 సంచిక:4

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00




# దెబ్బకు ఠా!

మీరో చిన్నారి హీరో! అవ్వాలని ఉందా అందరికన్నా వేగవంతమైన ఫన్ షూటర్! మరింక ఆలశ్యం దేనికి? మీరు చేయవలసిందల్లా ఈ పేజీని కత్తిరించడం, గోడమీద అతికించడం, మీకు నచ్చిన ఫన్ షూటర్ తీసుకుని గురిచూసి కొట్టడం. అంతే!
































అన్ని రకాల ఫన్ షూటర్స్‌గల అదరగొట్టేసే పోస్టర్ కోసం, మీ పేరు, వయస్సు, స్కూలు పేర్కొంటూ, స్వంత చిరునామాగల ఎన్‌వలప్‌తో సహా వీరికి వ్రాయండి:
గ్లో ప్లాస్ట్ లిమిటెడ్ (టాయ్స్ డివిజన్), లియో హౌస్, 88-సి, ఓల్డ్ ప్రభాదేవి రోడ్,
బొంబాయి-400 025.




ఆహ్లాదాన్నిచ్చే ఆటబొమ్మలు

HTA 1289.94

వార్తలు – విశేషాలు:

# మిత్రులయిన శత్రువులు





సుదీర్ఘకాలం శత్రువులుగా పోరాటం సాగించిన యూదులు- పాలస్తీనా అరబ్‌లు, సెప్టెంబర్ 13వ తేదీ చేసుకున్న చారిత్రాత్మకమైన శాంతిఒప్పందం ద్వారా మిత్రులయ్యారు. వాషింగ్టన్‌లో ప్రపంచనేతల, సమక్షంలో ఈ ఒప్పందం జరిగింది. ఇజ్రాయెల్ విదేశాంగ మంత్రి షిమోన్ పెరిజ్, పాలస్తీనా విమోచన సంస్థ (పి.ఎల్.ఒ.) రాజకీయ విభాగ అధ్యక్షుడు మహమ్మద్ అబ్బాస్ ఈ ఒప్పందంలో సంతకాలు చేశారు. ఇజ్రాయెల్ ప్రధాని ఇజాక్ రాబిన్, పాలస్తీనా విమోచన సంస్థ అధ్యక్షుడు యాసర్ అరాఫత్ కరచాలనం చేసి ఈ ఒప్పందం పట్ల తమ హర్షం వ్యక్తం చేశారు.

తమ స్వస్థానమైన పాలస్తీనా నుంచి అరబ్‌లను వలసవచ్చి స్థిరపడిన యూదులు తరుమగొట్టడంతో నాలుగు దశాబ్దాలకు పైగా హింసాత్మక పోరాటాలూ, ఘర్షణలూ, యుద్ధాలూ జరుగుతూ వచ్చాయి. ఈ శాంతిఒప్పందం ద్వారా గాజా కనుమకు పడమటి తీరంలో నివసిస్తున్న దాదాపు 3,00,000 మంది పాలస్తీనీయులకు స్వయం పరిపాలనాధికారాలు లభిస్తాయి. పాలస్తీనీయులకు, ఇజ్రాయెల్ యూదులకు మధ్య మరి రెండేళ్ళలో జరగనున్న సంపూర్ణమైన ఒప్పందానికి తొలిమెట్టుగా ఈ ఒప్పందాన్ని భావిస్తున్నారు.

ఇరవైరెండు నెలల క్రితం ఐక్యరాజ్యసమితి చేసిన ఒక తీర్మానం ద్వారా ఇప్పటి ఒప్పందానికి అంకురార్పణ జరిగింది: "జెరూసలెం, వలస వచ్చిస్థిరపడిన వారి విషయం, శరణార్థులు, సరిహద్దులు మొదలైన సమస్యల పరిష్కారాన్ని ఇజ్రాయెల్ – పాలస్తీనా తమ ఉమ్మడికర్తవ్యంగా భావించాలి."

1917వ సం॥ నవంబర్ 12వ తేదీ వెలువడిన బాల్ఫర్ డిక్లరేషన్‌తోనే యూదులు - పాలస్తీనీయుల మధ్య వివాదం ప్రారంభమయిందని చెప్పవచ్చు. లీగ్ ఆఫ్ నేషన్స్ ఆదేశం ప్రకారం అప్పుడు బ్రిటన్, పాలస్తీనా వ్యవహారాలను చూస్తున్నది. ఆనాటి బ్రిటిష్ విదేశాంగ కార్యదర్శి లార్డ్ ఆర్థర్ బాల్ఫర్, యూదులు 'మాతృభూమి' ఏర్పరచుకోవడానికి సుముఖతను చూపాడు. డిక్లరేషన్ రావడానికి ముందు

యూదులు అక్కడ యూదులరాజ్యం అవసరం లేదన్నారు. అయితే, డిక్లరేషన్ వెలువడిన తరవాత పాలస్తీనా అంతటినీ తమ మాతృభూమిగా ప్రకటించారు! బాల్ఫర్ – యూదులు పాలస్తీనాలో 'మాతృ భూమి'ని ఏర్పరచుకోవచ్చునని మాత్రమే చెప్పాడు. అయితే, యూదులు క్రమక్రమంగా వలస వచ్చి పాల స్తీనాలో స్థిరపడుతూ, అక్కడి అరబ్‌లను స్వస్థలం నుంచి తరుమగొట్ట సాగారు.

రెండవ ప్రపంచ యుద్ధం (1939-45) ముగిసేనాటికి పాలస్తీనాలో అరబ్బుల కన్నా యూదులు ఎక్కువయ్యారు. యూదులకు 'మాతృభూమి' కావాలనే 'జియోనిజం' బాగా బలపడింది. ఐక్యరాజ్యసమితి యూదుల రాజ్యానికి సభ్యత్వం ఇవ్వడానికి సిద్ధపడింది. 1948 మే 14వ తేదీ యూదులు ఏకపక్షంగా 'ఇజ్రాయెల్' రాజ్య స్థాపనను ప్రకటించుకున్నారు. నాటి నుంచి 1988 వరకు పాలస్తీనీయులకూ, ఇజ్రాయెల్ యూదులకూ మధ్య పోరాటం కొనసాగుతూ వచ్చింది.

1967వ సం॥లో ఇజ్రాయెల్ ఈజిప్టు, సిరియా, జోర్డాన్‌లను ఓడించి గాజా కనుమను సినాయ్‌ని, సిరియా గోలాన్ శిఖరాలనూ, జోర్డాన్ నది పడమటి తీరాన్నీ పట్టుకున్నది.

1973వ సం॥లో ఈజిప్టు ఇజ్రాయెల్‌తో యుద్ధానికి దిగి పోగొట్టుకున్న సినాయ్‌ని మళ్ళీ ఆక్రమించింది. ఈ కాలఘట్టంలోనే లెబనాన్‌లోని బీరూట్‌లో ప్రధాన కార్యాలయంగా పాలస్తీనా విమోచ సంస్థ (పి.ఎల్.ఒ) ఏర్పడి మాతృభూమి విముక్తికి పోరాటం ప్రారంభించింది. 1978వ సం॥ నుంచి పి.ఎల్.ఒ. సాగిస్తూన్న గెరిల్లా దాడికి ఎదురుదెబ్బ తీయడానికి 1982వ సం॥లో ఇజ్రాయెల్, లెబనాన్‌ను ముట్టడించింది. పి.ఎల్.ఒ. కార్యాలయాన్ని టునీజియాకు మార్చుకోవలసి వచ్చింది. 1988వ సం॥లో జోర్డాన్ నది పశ్చిమ తీరం పాలస్తీనా ప్రజలకు చెందుతుందని జోర్డాన్ దేశం ప్రకటించింది.

1990వ సం॥లో అమెరికా, అప్పటి సోవియట్ రష్యా అరబ్‌లు – యూదులుతమ వివాదాలను చర్చల ద్వారా పరిష్కరించుకోవాలని కోరాయి. ఐక్యరాజ్య సమితి ఆ కోరికను బలపరచింది. 1991వ సం॥లో స్పెయిన్‌లో చర్చలు ప్రారంభమయ్యాయి. 22నెలలు గడిచాయి. పి.ఎల్.ఒ అధ్యక్షుడు యాసర్ అరాఫత్ నార్వే మధ్యవర్తిత్వంతో ఇజ్రాయెల్ నాయకులతో రహస్యంగా చర్చలు జరిపాడు. ఇజ్రాయెల్‌ను గుర్తిస్తున్నట్టు అరాఫత్ ఉత్తరం పంపాడు. పి.ఎల్.ఒ.ను గుర్తిస్తున్నట్టు రాబిన్ ఉత్తరం పంపాడు. ఆ తరవాత తాత్కాలిక శాంతిఒప్పందంలోని అంశాలను చర్చించి రూపొందించారు. ఆ అంశాలు వెలువడ్డాక అటు యూదులలోనూ ఇటు పాలస్తీనీయులలోనూ కొన్ని అనుమానాలు తలెత్తక పోలేదు!




అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటన్ — ఈ శాంతిఒప్పందంలో సంతకాలు జరగడం తిలకించడానికి యాసర్ అరాఫత్‌నూ, ఇజాక్ రాబిన్‌నూ, వాషింగ్టన్‌కు ఆహ్వానించాడు. సంతకాలు, కరచాలనాలు అయ్యాక బిల్ క్లింటన్, "విశ్వాసం కలిగించే, గొప్ప చారిత్రక ఘట్టాన్ని కళ్ళారా చూశాం. ప్రధానీ (రాబిన్), అధ్యక్షా (అరాఫత్) ఈ రోజు మీకే చెందుతుంది. రేపు, వాళ్ళందరిదీ అవుతుంది," అన్నాడు అక్కడ చేరిన ఇజ్రాయెల్ — పాలస్తీనా పిల్లలను చూపుతూ.

శత్రువులైన వారు తమ మధ్య వివాదాలను చర్చల ద్వారా పరిష్కరించుకుని మిత్రులు కావచ్చుననడానికి ఈ ఒప్పందం ఒక ఉదాహరణ!



# మంచివాడి అదృష్టం

చింతలమెట్ట అనే గ్రామంలో వుండే లక్ష్మి అందమైనదీ, చురుకైనదీ కూడా. దానికి పెళ్ళీడు వచ్చింది. అది మంచివాడూ, అమాయకుడూ అయిన పొరుగింటి రాముడంటే ఇష్టపడింది.

ఇది తెలిసిన సోముడనే వాడు వెళ్ళి, "ఆ రాముడుత్త తెలివితక్కువవాడు. నన్ను పెళ్ళి చేసుకుంటే నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాను," అన్నాడు.

"రాముడి తెలివికేం తక్కువ? అంత తెలివైన వాడీ గ్రామంలోనే వుండడు," అన్నది లక్ష్మి.

"అయితే వాడి తెలివికీ, నా తెలివికీ పోటీ పెట్టు. వాడి తెలివితక్కువతనం బైటపడుతుంది," అన్నాడు సోముడు.

లక్ష్మి సోముడికీ, రాముడికీ చెరొక పది రూపాయిలూ ఇచ్చి, నగరం వెళ్ళి తనకు నచ్చేదేమైనా తీసుకురమ్మన్నది. అది రాముడితో, "నువ్వేం తెచ్చినా నాకు నచ్చుతుంది. ఎక్కడున్నా సరే, నీ మంచితనాన్ని మాత్రం విడిచిపెట్టకు. అదే నీ విలువను పెంచుతుంది," అని చెప్పింది.

రాముడేంతెచ్చినా సరే లక్ష్మి అదే నచ్చిందని అంటుంది కాబట్టి, వాడసలేమీ తేకుండా చేయాలని సోముడనుకున్నాడు. ఇందుకు రహస్యంగా వాడొక మనిషిని కూడా ఏర్పాటు చేసుకున్నాడు.

ఇద్దరూ అడవిదారిలో నగరానికి బయల్దేరి కొంతదూరం వెళ్ళాక సోముడు, రాముడితో, "ఈ చుట్టుపక్కల ఒక చెట్టు తొర్రలో నేను, కొన్నాళ్ళ క్రితం వందరూపాయిలు దాచాను. ఆ చోటెవరికీ తెలియడం నాకిష్టం లేదు. కాబట్టి, నువ్విక్కడే వుండు. నేనాడబ్బు తీసుకొస్తాను," అన్నాడు.

సోముడు తన డబ్బును చెట్టుతొర్రలో దాచుకున్నందుకాశ్చర్యపడినా, రాముడు

"వసుంధర"



వాడినేమీ అడక్క, అక్కడే వుంటానన్నాడు. అప్పుడు సోముడు మళ్ళీ వాడితో, "అడవిలో దొంగలుంటారు. వాళ్ళు తెలివైన వాళ్ళ జోలికి రారు. కాసేపు నిన్ను ఒంటరిగా ఇక్కడ వదిలి పోతున్నందుకు బాధగా వుంది. నేను నీ కొక సాయం చేస్తాను. నీ డబ్బు నీ దగ్గిరే వుంచుకో! కానీ, లక్ష్మి ఇచ్చిన పది రూపాయిలూ నాకివ్వు. దాచి పెడతాను," అంటూ వాడి దగ్గిర నుంచి పదిరూపాయిలు తీసుకుని చెట్లల్లోకి వెళ్ళాడు.

అంతవరకూ రాముడికి తెలియకుండా, వాళ్ళను అనుసరించి వస్తున్న సోముడి మనిషి, సోముడిని చాటుగా కలుసుకున్నాడు. సోముడు వాడికేం చేయాలో చెప్పిపంపాడు.

ఆ ప్రకారం వాడు రాముడి వద్దకు వెళ్ళి కత్తి చూపి బెదిరించి వాడి దగ్గిరున్న డబ్బంతా తీసుకుని వెళ్ళి సోముడి కందజేశాడు. సోముడు వాడికి ఒక రూపాయి బహుమతిగా ఇచ్చి పంపేసి, సంతోషంగా రాముడి దగ్గిరకు వచ్చాడు.

రాముడు జరిగిందంతా సోముడికి చెప్పి, "అంతా నువ్వు చెప్పినట్లే జరిగింది. నీ దయవల్ల నీ దగ్గిర దాచిన లక్ష్మి డబ్బు మాత్రం నాకు మిగిలింది," అన్నాడు.

ఇద్దరూ నగరం చేరాక, ఒక నగల దుకాణం దగ్గిరకు వెళ్ళారు. అక్కడ సోముడు ఒక నగను బేరం చేసి పదిరూపాయిలకు కొన్నాడు. అది చూసి రాముడు కూడా ఒక నగ కొనా లనుకున్నాడు. దుకాణం వాడు నవ్వి, "సోముడుగారు మాకెన్నోసార్లు తన తెలివితో సాయపడ్డారు. అందుకని ఆయనకు ఊరికే ఇస్తే ఒప్పుకోడని పది రూపాయిలకే ఈ నగ ఇచ్చాం. ఇంకెవరికైనా అయితే రెండు వందల రూపాయిలకు తక్కువ కివ్వం," అన్నాడు.

సోముడు అంత విలువైన నగ కొన్నాక, తానేం కొన్నా తక్కువగానే వుంటుందని, రాముడు తానేమీ కొనలేదు. సోముడు మాత్రం తర్వాత దుకాణం లోపలకు వెళ్ళి, దుకాణం వాడికి మిగతా డబ్బిచ్చి తను చెప్పినట్లే చేసినందుకు వాడికి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

ఇద్దరూ తిరుగుప్రయాణమయ్యాక, దారిలో సోముడు, రాముడితో, "నువ్వు నీ డబ్బంతా పోగొట్టుకున్నావు. నీకు తెలివి లేదు. నిన్ను చేసుకుంటే లక్ష్మికి సుఖముండదు. కాబట్టి లక్ష్మికి నా గురించి గొప్పగా చెప్పి, ఎలాగైనా నాతో పెళ్ళికి ఒప్పించు," అన్నాడు.

"నువ్వు, చెప్పింది నిజం. నువ్వు చాలా తెలివైనవాడివి. నిన్ను చేసుకుంటే లక్ష్మి సుఖపడుతుంది," అని రాముడు ఒప్పుకున్నాడు.

ఇద్దరూ అడవిని దాటి గ్రామాన్ని సమీపిస్తూ, ఒక చెట్టు కింద పరదేశి నొకడిని చూశారు. వాడు వాళ్ళిద్దరి గురించీ వివరాలడిగి తెలుసుకుని, "దురదృష్టవంతులకు సాయపడమని ఒక దేవత నన్నాదేశించింది. ఈ రాముడికి నా దగ్గిరున్న వజ్రాల హారాన్నిస్తాను," అంటూ ధగధగలాడే హారాన్ని వాడికిచ్చి, "దీన్ని నీకిష్టమైన వారికి తప్ప మరెవరికీ ఇవ్వకు. నువ్వు మంచితనాన్ని విడిచి పెట్టకుండా వుంటే, నీకు దేవతలు సాయపడతారని గుర్తుంచుకో!" అని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

ఇద్దరూ లక్ష్మివద్దకు వెళ్ళాక సోముడినగ, రాముడిహారం ముందు వెలవెల బోయింది. సోముడు, లక్ష్మితో, "రాముడికి తెలివిలేదు. అదృష్టం కలిసొచ్చి ఈ సారికిలాగయింది కానీ, ఇందులో వాడి గొప్పతనమేమీ లేదు," అన్నాడు.

"మంచివాడినే అదృష్టం వరిస్తుంది. ఈ విషయంలో నీకు నమ్మకం లేకపోతే, మీ





ఇద్దరికీ మరొక అవకాశం ఇస్తున్నాను," అన్నది లక్ష్మి.

మర్నాడు మిత్రులిద్దరూ లక్ష్మి దగ్గిర్నుంచి చెరొక పది రూపాయిలు తీసుకుని నగరానికి బయల్దేరారు. ఈసారి లోగడ సోముడు చేసిన ఏర్పాటు ప్రకారం రాముడికైన అనుభవా లన్నీ, సోముడికయ్యాయి. అడవిలో దొంగ వచ్చి వాడిని దోచుకుని, రాముడిని విడిచి పెట్టాడు.

ఇద్దరూ నగలదుకాణానికి వెళ్ళారు. అక్కడ దుకాణం యజమాని రాముడిని చూసి, "అయ్యా! మీ ముఖంలో అదృష్టదేవత తాండ విస్తున్నది. మీ వంటి వారు ఊరికే ఒక వస్తువు మా దుకాణంలో తీసుకుంటే చాలు. మాక దృష్టం తిరుగుతుంది!" అంటూ బలవంతంగా వాడికొక నగ ఇచ్చాడు.

ఊరికే తీసుకుంటే బాగుండదని రాముడు దానికి పది రూపాయిలిస్తే, సోముడు దుకాణం యజమానికి చాటుగా మిగతా డబ్బిచ్చాడు. ఇద్దరూ తిరుగుప్రయాణంలో గ్రామ పొలి మేరలు చేరుకునే సరికి, వాళ్ళకు మళ్ళీ ఇదివరకటి పరదేశి కనబడి, జరిగిందంతా అడిగి తెలుసుకున్నాడు.

సోముడు, పరదేశికి కళ్ళనీళ్ళు వచ్చే విధంగా తన కథ చెప్పి, "అయ్యా! అడవిలో దొంగ నాదగ్గిరున్న డబ్బంతా దోచుకోవాలని చూశాడు. అయితే, వాడు దోచుకున్నది దోచు కోగా వాడి కంటబడకుండా కొంత డబ్బు దొరుగలిగాను. ఆ మొత్తం నగరంలో ఖర్చ యిపోయింది," అన్నాడు దిగులుగా.

పరదేశి అంతా విని, సోముడితో, "నీ అంత దురదృష్టవంతుడు లోకంలో వుండడు. నడిసముద్రంలో వున్నవాడికి చేయూతనిస్తే, వాడి బరువుకు మనమూ సముద్రంలో మునిగిపోతాం. దురదృష్టవంతుణ్ణి బాగు చేసేవారు లేరు. ఈ రాముడు చాలా అదృష్ట వంతుడు! అలాంటి వారికే సాయపడమని నిన్న తెల్లవారుజామున దేవత నన్నాజ్ఞాపిం చింది!" అంటూ మరొక వజ్రాల హారాన్ని రాముడికిచ్చి వెళ్ళిపోయాడు.

ఇద్దరూ లక్ష్మి వద్దకు వెళ్ళాక, అది రాము డిచ్చిన వజ్రాలహారాన్ని తీసుకుని, సోముడితో,

"రాముడిని దురదృష్టం వెంటాడినా అదృష్టం సరిచేసింది. నీ దురదృష్టం దురదృష్టంగానే మిగిలిపోయింది. అదే మంచితనానకీ, చెడ్డ తనానికీ తేడా!" అన్నది.

ఇది విని సోముడు నిరుత్సాహంగా వెళ్ళ బోతూంటే, లక్ష్మి వాడంతకు ముందు రోజు ఇచ్చిన నగను, ఇంటి లోపలి నుంచి తెచ్చి వాడికి తిరిగి ఇచ్చి, "ఇది నేను తీసుకోవడం న్యాయం కాదు. దీన్ని నీ కాబోయే భార్య కిచ్చుకో," అన్నది.

"ఏం? నిన్ను పెళ్ళి చేసుకోకపోయినా, అభిమానం కొద్దీ నగను నీకు ఇవ్వకూడదా?" అన్నాడు సోముడు.

"పరాయిసొమ్ము నేనుంచుకోను. అన్నట్టు మీ ఇంటి పక్కనే వున్న కామాక్షిని మా ఇంటికి పంపు. రాముడికిచ్చిన నకిలీ వజ్రాల హారాలను దానికిచ్చి వేయాలి. ఇదీ పరాయి సొమ్మే. దీనిని కూడా నేనుంచుకోను!" అన్నది లక్ష్మి.

సోముడాశ్చర్యంగా, "ఎంత అన్యాయం? అంటే, నువ్వు కావాలనే పరదేశిగా ఒకణ్ణి పంపి, ఈ నాటక మాడించావన్నమాట!" అన్నాడు.

"ఇందులో అన్యాయ మేముంది? నువ్వు నన్ను మోసం చేయాలని కామాక్షి అన్నను దొంగలాగా నటించమన్నావు. కామాక్షికి నువ్వంటే ఇష్టమని దాని అన్నకు తెలుసు. అందువల్ల వాడు నాకీ కథంతా ముందే చెప్పేశాడు. నేనుకూడా వాడిసాయమే తీసుకుని, నిన్ను మోసం చేశాను. నువ్వు గుర్తు పట్టలేదు కానీ, పరదేశీ కూడా వాడే! వేషాలు మార్చడంలో వాడు ఎంతో దిట్ట. కామాక్షి నిన్ను ప్రేమించడం నా అదృష్టం. లేకుంటే నాకు నీ మోసం తెలిసేది కాదు," అన్నది లక్ష్మి.

లక్ష్మి మాటల్లోని నిజం గ్రహించాక, కామాక్షి వంటి మంచిదీ, తెలివైనదీ తనను ప్రేమించడం తన అదృష్టమని సోముడికర్థ మయింది.

రాముడు లక్ష్మినీ, సోముడు కామాక్షినీ పెళ్ళి చేసుకుని చాలా కాలం ఎంతో సుఖంగా జీవించారు.



# ఎలాంటి ఇష్టం?

పూర్వం విద్యావతీనగరంలో, చంద్రకాంతుడనే యువకుడుండేవాడు. అతడు రాజాస్థానంలో ఉద్యోగం కోసం ప్రయత్నిస్తూండగా, ఆస్థాన విషయాలు బాగా తెలిసిన ఒకతను అతడితో, "జీహ్వేంద్రనాధుడనే రాజోద్యోగి ద్వారా, నీకు ఉద్యోగం దొరికే అవకాశం వున్నది. అతడికి పక్షులంటే ఇష్టమని విన్నాను. నీ అదృష్టం పరీక్షించుకో!" అని చెప్పాడు.

జీహ్వేంద్రనాధుడి పుట్టినరోజు ఒక నెల రోజుల్లో రానున్నదని తెలుసుకున్న చంద్రకాంతుడు, ఒక రామ చిలుకకు మాట్లాడడం నేర్పాడు. దాన్ని ఒక పంజరంలో వుంచి, రాజోద్యోగి పుట్టిన పండగ రోజున దాన్ని తీసుకువెళ్ళి ఆయనకిచ్చాడు.

"మీకు నా హృదయపూర్వక జన్మదిన శుభాకాంక్షలు!" అన్నది చిలుక.

జీహ్వేంద్రనాధుడు ఆశ్చర్యంగా, చిలుకకేసి చూసి, "ధన్యవాదాలు!" అన్నాడు.

చిలుక జవాబుగా, "ధన్యవాదాలు!" అన్నది.

చంద్రకాంతుడు తన ఉద్యోగ విషయం, జీహ్వేంద్రనాధుడికి చెప్పి, వారం రోజుల తర్వాత ఆయనను మళ్ళీ కలుసుకున్నాడు.

జీహ్వేంద్రనాధుడు, అతణ్ణి నవ్వుతూ పలకరించి, "సోమవారం నాడు వచ్చి ఉద్యోగంలో చేరు!" అని, "ఇంకేం విశేషాలు?" అని అడిగాడు.

చంద్రకాంతుడాయనకు కృతజ్ఞతలు చెప్పుకుని, ఏం మాట్లాడాలో తెలియక, "తమరికి నేనిచ్చిన చిలుక నచ్చిందా?" అని అడిగాడు.

"ఆహా! మహాబాగా నచ్చింది. పక్షులన్నింటిలోకీ చిలుక మాంసం అంటే నాకు చాలా ఇష్టం. ఆ రోజే నీవిచ్చిన చిలుకను వేపుడు చేయించుకుని తిన్నాను," అన్నాడు జీహ్వేంద్రనాధుడు. — యస్. లక్ష్మీవిద్య





# విచిత్ర పుష్పం

## 7

[రాజు ప్రతాపవర్మ కోరిక ప్రకారం, ఉత్తుంగుడు మిత్రులను వెంటబెట్టుకుని వెళ్ళి, శతాబ్దిక పుష్పాలను కోసుకుని వచ్చాడు. ఆలోగా పడవ సిద్ధమయింది. ఉత్తుంగ తెగ నాయకుడూ, చెల్లెలు రజనీ, మరి నలుగురు మిత్రులూ ఉత్తుంగుడి వెంట సముద్రం వరకు వచ్చి అతన్ని సాగనంపారు. ఉత్తుంగుడు శతాబ్దిక పుష్పాలతో, రాకాసి మృగాన్ని వెతుక్కుంటూ సముద్రమధ్యానికి పడవలో ఒంటరిగా ప్రయాణమయ్యాడు. — తరవాత]

ఉత్తుంగుడికి పడవ ప్రయాణంలో అనుభవం లేదు. శృంగ్మాయ్ కొండలలో సెలయేళ్ళే తప్ప పెద్ద నదులు లేవు. అక్కడ ఉన్న ఒక్కగానొక్క నది చిత్రావతి పొంగినప్పుడు, ఉత్తుంగుడు మిత్రులతో కలిసి తెప్పకొయ్యల మీద కొంత దూరం సరదాగా వెళ్ళివచ్చేవాడే తప్ప, పడవ నడపవలసిన అవసరం అతనికి అంతకు ముందెన్నడూ కలగలేదు. అయినప్పటికీ ఇప్పుడు మాణిక్యపురిని రాకాసిమృగం బారినుంచి కాపాడాలన్న దృఢసంకల్పంతో అతడు పడవను ముందుకు నడపసాగాడు. సముద్రంలో కొంతదూరం వెళ్ళాక అలల ఉధృతం తగ్గింది. చిన్న చిన్న అలల మీద పడవ వేగంగా నడిచింది. అలా కొంత దూరం వెళ్ళి, అది నిలకడగా ఉన్న నీళ్ళలోకి ప్రవేశించింది. ఇప్పుడు పడవ ముందుకు వెళ్ళాలంటే తెడ్డు ఉపయోగించవలసి వచ్చి, అతడు దానిని అందుకున్నాడు.



మెల్లమెల్లగా చుట్టుపక్కల చిమ్మచీకటి కమ్ముకోసాగింది. ఆకాశం మేఘాలు లేకుండా నిర్మలంగా ఉండడంతో, చుక్కలు పెట్టినట్టు నక్షత్రాలు ఒక్కొక్కటే మెరుస్తూ రాసాగాయి. మరికొంత సేపటికి ఎటుచూసినా గాఢాంధకారం ఆవరించింది. రాకాసిమృగం ఏ క్షణంలోనైనా ఎటువైపు నుంచయినా నీళ్ళ నుంచి పైకి రావచ్చునన్న హెచ్చరికతో, ఉత్తుంగుడు జాగ్రత్తగా చుట్టుపక్కల కలయ చూస్తూ ముందుకు వెళ్ళసాగాడు. చాలా దూరం వెళ్ళాక హఠాత్తుగా అతని వెనక ఏదో నల్లటి ఆకారం కనిపించింది. ఉత్తుంగుడు వెంటనే పడవను వెనక్కు తిప్పాడు. ఆ నల్లటి ఆకారం క్రమక్రమంగా పెద్దదవుతూ పడవకేసి రావడం అతడు గమనించాడు. అది ఏమై ఉంటుందా అని అతడు పరిశీలించి చూశాడు. ముఖం స్పష్టంగా కనిపించకపోయి నప్పటికీ దాని పెద్ద తలా, వెడల్పాటి భుజమూ, పెద్ద పెద్ద చేతులూ చూసి అది తప్పకుండా రాకాసిమృగమే అయివుంటుందని ఉత్తుంగుడు గ్రహించాడు. అది కదిలే తీరును చూస్తుంటే, అంతగా లోతులేని నీళ్ళలో పెద్ద కాళ్ళతో మెల్లగా నడిచి వస్తున్నట్టు అతనికి అనిపించింది!

నడిసముద్రంలో రాకాసిమృగాన్ని ఎదుర్కొనడం దుస్సాహసమవుతుందని అతడు భావించి, సమీపంలో భూభాగం కనిపించేంత వరకు దానికి అందకుండా వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. పడవను వేగంగా నడుపుతూ, రాకాసిమృగం వస్తున్నదా లేదా అని అప్పుడప్పుడు తిరిగి చూస్తూ ప్రయాణం సాగించాడు. కొంతదూరం వెళ్ళేసరికి దూరంగా పెద్ద రాళ్ళగుట్ట కనిపించింది. ఆహా! భూప్రదేశం! అన్న ఆనందంతో అతడు దానిని సమీపించాడే తప్ప, తీరా దగ్గరికి వెళ్ళాక నేల మీద కాలుమోపడానికి చోటు లేదు. ఎటు చూసినా ఎత్తయిన బండలే ఉన్నాయి. పైగా, అక్కడ అలలు ఉవ్వెత్తుగా లేచి బండలను తాకుతూ ఉండడం వల్ల, పడవ మళ్ళీ, పైకీ కిందికీ ఊగిసలాడ సాగింది. దానిని అదుపులో పెట్టడానికి ఉత్తుంగుడు అతికష్టంతో ప్రయత్నించ

సాగాడు. అప్పుడు హఠాత్తుగా తాడిచెట్టు ప్రమాణంలో లేచిన ఒక రాక్షసఅల, పడవను అమాంతం లేపి బండల మధ్య ఉన్న ఒక ఇరుకు సందు గుండా వెలుపలికి విసిరి కొట్టింది. ఆ వేగానికి పడవ తల్లకిందుల యింది. ఉత్తుంగుడు ఎగిరి పడవ కవతల ఇసుకపై పడ్డాడు. పడవలోని పూల కట్టలు అతని తల మీద చెల్లాచెదురుగా పడ్డాయి!

క్షణాలలో జరిగిపోయిన ఈ హఠాత్ పరిణామానికి ఉక్కిరి బిక్కిరయిన ఉత్తుంగుడు మరుక్షణమే తేరుకుని, చెల్లాచెదరయిన పువ్వులను ఏరి పడవ దగ్గరికి తెచ్చాడు. ఆలోగా చాలా పువ్వులు నీళ్ళపై తేలుతూ వెళ్ళడం అతడు గమనించాడు. శతాబ్దిక పుష్పాలు ఇక్కడ ఉన్నాయి కాబట్టి, రాకాసి మృగం ఇటువైపు ఆకర్షింపబడి రావచ్చునని అతడు అనుకున్నాడు. అయితే, అక్కడ ఉన్న మార్గం మరీ ఇరుకుగా ఉన్నది. అది రాకాసిమృగం రావడానికి చాలినంతగా లేదు. మళ్ళీ పడవలో వెళ్ళి రాకాసిమృగాన్ని ఇటువైపు తీసుకువద్దామనుకున్నా అది సాధ్యమయ్యే పని కాదు. ఏం చేద్దామా అని ఆలోచిస్తూ అతడు అలాగే కొంతసేపు నిలబడ్డాడు. రాకాసిమృగం కనిపిస్తుందేమోనని మళ్ళీ ఒకసారి జాగ్రత్తగా చూశాడు. కాని, దాని జాడ కనిపించలేదు. చాలాసేపు గడిచింది. తూరుపు దిక్కున అప్పుడప్పుడే వెలుగు రేఖలు కనిపిస్తున్నాయి. ఆ సమయంలో



అతనికి సముద్రంలో రాకాసిమృగం వీపు కనిపించింది. రాజుగారు తెలియజేసినట్టు, ఆ రాకాసిమృగం తెల్లవారక ముందే సముద్ర మధ్యాన్ని చేరుకుంటున్నదని అతడు గ్రహించాడు. మళ్ళీ పొద్దుగూకి రాత్రి అయ్యేంత వరకు అది సముద్రం వదిలి వచ్చే అవకాశం లేదని అతడు నిర్ణయించుకున్నాడు.

ఆ తరవాత అతడు తల్లకిందులుగా పడి వున్న పడవను భుజంతో లేవనెత్తి సరిగ్గా ఉంచాడు. ఏరి వుంచిన శతాబ్దిక పుష్పాలనూ, మొక్కలనూ తీసి పడవలో ఉంచాడు. ఆ పువ్వులు ఇంకా అప్పుడే పూచినట్టు, సువాసనలు వెదజల్లుతున్నాయి. ఆ మొక్కలను నాటడానికీ, పువ్వులను దాచడానికీ సరైన



స్థలం ఏదా అని చుట్టుపక్కల పరిశీలించి చూశాడు. అప్పటికే బాగా తెల్లవారింది. ఆ తరవాత ఆలోచిస్తూ ఒక బండ మీద కూర్చుని, విశ్రాంతి కోసం కళ్ళు మూసుకున్నాడు. రాత్రంతా పడవ ప్రయాణం చేసి, బాగా అలిసిపోయి వుండడం వల్ల, కొంత సేపట్లోనే అతడు ఆదమరచి నిద్రపోయాడు!

అలా ఎంతసేపు నిద్రపోయాడో అతనికి తెలియలేదు. తల వెనక ఆడవాళ్ళ నవ్వులు వినిపించి ఉలిక్కిపడి లేచి, తను కల కనడం లేదుకదా అనుకుంటూ తలతిప్పి వెనక్కు చూశాడు. ఆరుగురు యువతులు బిలబిలమంటూ వచ్చి అతన్ని చుట్టుముట్టారు. వాళ్ళ వేషభాషలు విచిత్రంగా ఉన్నాయి. రంగురంగుల దుస్తులు ధరించి ఉన్నారు. కొప్పులనూ, చేతులనూ పువ్వులతో అలంకరించుకున్న వాళ్ళు ఏ కొండ జాతివాళ్లో అయివుంటారని ఉత్తుంగుడు భావించాడు. అయితే, వాళ్ళు మాట్లాడే భాష అతనికి అర్థం కాలేదు. ఆరుగురి యువతుల చేతులలోనూ శతాబ్దిక పుష్పాలు ఉన్నాయి. వాటిని సంతోషంగా వాసన చూస్తూ తమలో తాము ఏదో మాట్లాడుకుంటున్నారు. చేతులలోని పువ్వులను వాళ్ళు మళ్ళీ అక్కడే వుంచి ఎప్పుడు వెళ్ళిపోతారా అని కొంతసేపు ఎదురుచూశాడు. వాళ్ళు ఎంతకీ ఆ పని చేసేట్టు లేదు. దానిని గ్రహించిన ఉత్తుంగుడు, "నేను ఆ పువ్వులను మాణిక్యపురి నుంచి తెస్తున్నాను. ఒక ముఖ్యమైప పని మీద వాటిని దూర ప్రాంతాలకు తీసుకు వెళుతున్నాను. మీరు దయచేసి ఆ పువ్వులను పడవలో ఉంచండి! సూర్యుడస్తమించాక నేను ఇక్కడి నుంచి బయలు దేరాలి!" అన్నాడు.

రాకాసిమృగం గురించి చెప్పి వాళ్ళను బెదరగొట్టడం అతనికి ఇష్టం లేదు.

"మాణిక్యపురి! మాణిక్యపురి!" అంటూ ఆ యువతులు నవ్వారే తప్ప, మరేదీ మాట్లాడ లేదు.

ఉత్తుంగుడు పడవ దగ్గరికి వెళ్ళి నిలబడి, వాళ్ళకేసి చూస్తూ, "మీరు ఆ పువ్వులను ఇక్కడి నుంచి తీశారు కదూ?" అని అడిగాడు చేయి చూపుతూ.



"అవును," అన్నట్టు తలలు ఊపారు ఆ యువతులు.

"మరి, వాటిని మళ్ళీ అక్కడే ఉంచండి!" అన్నాడు సైగచేస్తూ.

ఆ యువతులు తలలు అడ్డంగా ఊపుతూ, ఏదో చెప్పారు. ఉత్తుంగుడికి ఆ మాటలు ఏ మాత్రం అర్థం కాలేదు. అతడు కోపంగా, "ఆ పువ్వులు నావి! మర్యాదగా వాటిని పడవలో ఉంచండి!" అని గద్దించాడు చేయి ఊపుతూ.

అయినా, వాళ్ళు పువ్వులను వాసన చూస్తూ పకపకమని నవ్వసాగారు. ఆఖరికి వాళ్ళలో ఒక యువతి ఉత్తుంగుణ్ణి సమీపించి, అతన్ని తాకి చేయెత్తి దూరంగా చూపుతూ ఏదో చెప్పింది.

"ఈ పువ్వులను తీసుకుని మేము ఇంటికి వెళుతున్నాము. నువ్వూ వస్తావా?" అని అడిగినట్లు ఆమె చేసిన సైగను బట్టి గ్రహించాడు.

మిగతా అయిదుగురు యువతులూ అప్పుడే అక్కడి నుంచి బయలుదేరారు.

"సరే, వస్తాను. నేను అక్కడికి వచ్చాక నా పువ్వులను నాకు ఇచ్చేయాలి!" అని ఉత్తుంగుడు వాళ్ళ వెంట బయలుదేరడానికి సిద్ధమవుతూ ఒకసారి పడవలోకి చూశాడు. అక్కడ ఒక్క పువ్వు కూడా లేదు. మొక్కలు మాత్రం ఉన్నాయి. పడవను అక్కడే వదిలితే, మళ్ళీ పెద్ద అల లేచి, దానిని సముద్రంలోకి లాక్కుపోవచ్చునన్న అనుమానంతో అతడు పడవను మరికొంత వెనకకు తోసి వదిలిపెట్టాడు. మొక్కలు అక్కడ ఉండడం అంత క్షేమం కాదని భావించి, వాటిని చేతిలోకి తీసుకుని, తెడ్డును పడవలో పడవేసి, యువతులకేసి తిరిగాడు. వాళ్ళు ఒకచోట ఆగి ఉత్తుంగుడి కోసం నవ్వుతూ ఎదురు చూస్తున్నారు.

ఉత్తుంగుడు చకచకా నాలుగు అడుగులు వేసి వాళ్ళను సమీపించాడు. వాళ్ళు మాట్లాడే భాషను అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ, అతడు వాళ్ళ వెనకగా కొంతదూరంలో మౌనంగా నడవసాగాడు. అతడు తమ వెంట వస్తున్నాడా, లేదా అని అప్పుడప్పుడు తిరిగి చూస్తూ ఆ యువతులు తమ నివాసం కేసి నడక సాగించారు.



కొంతసేపటికి వాళ్ళు ఇసుక ప్రదేశం దాటి, ఎర్రమట్టి ప్రాంతాన్ని చేరుకున్నారు. చుట్టూ కొండలతో ఆ ప్రాంతం ఒక లోతైన పళ్ళెంలా కనిపించింది. చుట్టూ చెట్టుచేమలతో పచ్చగా ఉన్నది కాని, పెద్ద వృక్షాలు కనిపించ లేదు. మరికొంత దూరం వెళ్ళేసరికి ఒక చిన్న గూడెం ఎదురయింది. వాళ్ళను చూడగానే గుడిసెల నుంచి వెలుపలికి వచ్చిన స్త్రీలు కొందరు ఆ యువతులను ఏదో అడిగారు. దానికి ఆ యువతులు ముక్తసరిగా సమాధానాలు చెబుతూ వెళ్ళి గూడెం మధ్యలో ఉన్న ఒక పెద్ద గుడిసెను సమీపించి, "అమ్మా, అమ్మా," అని పిలిచారు. కొంతసేపటికి ఒక మధ్యవయస్కురాలు తలుపు తెరుచుకుని వెలుపలికి వచ్చింది.

"మేము, ఏం తెచ్చామో చూడు. అందంగా ఉన్నాయి కదా?" అంటూ తాము తెచ్చిన పూలను చూపింది ఒక యువతి ఎంతో సంతోషంగా.

"చాలా అందంగా ఉన్నాయి! మంచి వాసన కూడా వేస్తున్నాయి! ఎక్కడి నుంచి తెచ్చారు?" అని అడిగిందా స్త్రీ.

"సముద్ర తీరానికి వెళితే ఆ యువకుడు ఒకచోట నిద్రపోతూ కనిపించాడు. అతని పక్కన ఒక పడవ, పడవలో ఈ పువ్వులు కనిపించాయి. అతడు మనకోసమే తెచ్చి ఉంటాడని వాటిని తీసుకున్నాము. అతడు మాణిక్యపురి నుంచి వచ్చినట్టున్నాడు. అతడేదో చెప్పాడు కానీ, మాకు అర్థం కాలేదు! మా వెంట పిలుచుకుని వచ్చాము. అందంగా ఉన్నాడు కదూ?" అంటూ ఒక యువతి ఉత్తుంగుణ్ణి చూపింది.

"అవును, చక్కగా ఉన్నాడు. కాబూయీ రానీ, అతనితో మాట్లాడి సంగతి తెలుసుకుంటాడు. ఇక మీరు లోపలికి వెళ్ళండి," అన్నదా స్త్రీ.

యువతులు ఆరుగురూ ఒకరి వెనక ఒకరు ఇంటి లోపలికి వెళ్ళారు. ఆ స్త్రీ ఉత్తుంగుణ్ణి కూర్చోమని సైగ చేసి లోపలికి వెళ్ళింది.

వాళ్ళేమి మాట్లాడుకున్నదీ ఉత్తుంగుడికి అర్థం కాలేదు. ఆ ఇంటిని బట్టి చూస్తే, అది

ఆ గూడెం నాయకుడిదై ఉంటుందని అతడు ఊహించాడు. లోపలికి వెళ్ళిన స్త్రీ, పళ్ళెం లాంటి ఒక పాత్ర నిండా ఏదో పానీయం తెచ్చి ఉత్తుంగుడికి ఇచ్చి, "బాగా అలిసిపోయినట్టున్నావు. దీనిని తాగు. కాబూయీ వచ్చాక మాట్లాడుతూ భోజనం చేద్దువు గాని!" అన్నది.

ఉత్తుంగుడు ఆ పాత్రను తీసుకుని, అందులోని పానీయాన్ని తాగి, పాత్రను పక్కన పెట్టాడు. దాపులనున్న ఒక గుంజకు ఆనుకుని కూర్చుని, యువతులు ఇంటి లోపలికి తీసుకువెళ్ళిన శతాబ్దిక పుష్పాలను గురించి ఆలోచించసాగాడు: ఇక్కడున్న శతాబ్దిక పుష్పాల చేత ఆకర్షింపబడి సముద్రంలోని రాకాసిమృగం ఇటువైపు వచ్చిందంటే ఏం చేయాలి? అయినా, సముద్ర తీరంలో ఎత్తయిన గోడ కట్టినట్టు బండలున్నాయి. ఆ బండలను దాటుకుని రాకాసిమృగం వచ్చే అవకాశం లేదు. బండల మధ్య చిన్న ఇరుకు మార్గం మాత్రం ఉన్నది. ఆ మార్గం గుండా రాకాసిమృగం రావడానికి సాధ్యపడదు. పడవ తల్లకిందులయినప్పుడు సముద్రంలోకి కొట్టుకుపోయిన పువ్వులతో రాకాసి మృగం ప్రస్తుతానికి తృప్తి చెందవచ్చు. ఒకవేళ అవసరమైతే ఇక్కడి ప్రజలు తనకు సహాయపడగలరా?

భుజాన్ని ఎవరో బలంగా తట్టడంతో ఉత్తుంగుడు ఆలోచనల నుంచి బయటపడి, తల పక్కకు తిప్పి చూశాడు.

ఎదురుగా నిలబడ్డ ఒక దృఢకాయుడు, "ఎవరు నువ్వు?" అని అడిగాడు.

ఉత్తుంగుడికి ఆ ప్రశ్న అర్థం కాలేదు. అయినా అతడు, "మాణిక్యపురి రాజ్యం శృంగ్మాయ్ కొండల నుంచి వచ్చాను. నా పేరు ఉత్తుంగుడు!" అన్నాడు.

"శృంగ్మాయ్ కొండల నుంచి వస్తున్నావా? చాలా సంతోషం. లోపలికి వెళదాం, రా!" అంటూ ఇంటి లోపలికి దారితీశాడు దృఢకాయుడు.

అతనికి తమ భాష తెలుసు అని గ్రహించగానే, ఉత్తుంగుడు చాలా సంతోషంగా లేచి నిలబడ్డాడు. — (ఇంకావుంది)






# చిత్రవర్ణుడి కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ప్రతిఒక్కసారీ ప్రయత్నం విఫలమవుతున్నా, నిరాశానిస్పృహలకు లోను కాకుండా, కార్యసాధన పట్ల నీ పట్టుదల చూస్తూంటే, నువ్వు మహాసత్వుల కోవకు చెందినవాడివని తోస్తున్నది. అయితే, ఎంతటి మహాసత్వుడూ, శూరుడూ, వీరుడూ అయినా, ఒక్కొక్కసమయంలో సమయస్ఫూర్తితో ప్రవర్తించలేక, తర్వాత విచారానికీ, తీవ్రమైన ప్రతీకారవాంఛకూ లొంగిపోతాడు. నీలో కూడా ఇలాంటి లోపమేమైనా వుంటే, శ్మశానంలో ఈ అర్ధరాత్రి వేళ నువ్వు అచంచలమైన పట్టుదలతో పడుతున్న శ్రమ అంతా, ఆఖరి క్షణంలో బూడిదలో పోసిన పన్నీరు కాగలదు. ఇందుకు ఉదాహరణగా చిత్రవర్ణుడనే రాజు కథ

## బేతాళ కథలు



చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

చిత్రవర్ణుడు సౌవీరదేశానికి రాజు. తండ్రి మరణానంతరం సింహాసనాన్ని అధిష్ఠించిన అతను అచిరకాలంలోనే సమర్థుడైన పాలకుడుగా పేరు తెచ్చుకున్నాడు. పద్మగిరి యువరాణి రాగిణి ఏడాది క్రితం, స్వయంవర మంటపంలో చిత్రవర్ణుడి మెడలో వరమాల వేసి భర్తగా ఎన్నుకున్నది. రాగిణి సౌందర్యరాశే కాక, రాజనీతి విషయాల్లో కూడా అందెవేసిన చేయి. భర్తకు పాలనాపరమైన సమస్యలు ఎదురైనప్పుడు తగిన సలహాలు ఇచ్చి సాయపడేది.

సౌవీర రాజధానీ నగరానికి, నాలుగైదామడల దూరాన గల కొండప్రాంతంలోని మహారణ్యంలో, ఎంతో పురాతనమైన ఒక కాళికాదేవి ఆలయం వున్నది. బహుశా, రాజైనవాడి ధైర్యసాహసాలను పరీక్షించడానికి కావచ్చు – ఆ దేశపు రాజు కనీసం ఏడాదిలో ఒక సారైనా, ఆ ఆలయానికి ఒంటరిగా వెళ్ళి దేవీపూజ చేసి రావాలన్న ఆచారం వుండేది.

ఆ ప్రకారం, ఒకనాడు రాజు చిత్రవర్ణుడు ఒంటరిగా గుర్రం ఎక్కి కాళికాదేవి ఆలయానికి బయలుదేరాడు. అతను అరణ్యం ప్రవేశించి, దేవీఆలయ ప్రాంతాన్ని సమీపిస్తున్నంతలో, దాపుల వున్న మహావృక్షాల వెనక నుంచి ఒక స్త్రీ ఆర్తనాదం వినిపించింది.

చిత్రవర్ణుడు వెంటనే గుర్రాన్ని అదిలించి అటుకేసి వెళ్ళాడు. అక్కడ రాక్షసుడొకడు, ఒక కోయయువతిని పట్టుకుని మింగే ప్రయత్నంలో వున్నాడు.

చిత్రవర్ణుడు గుర్రం మీదనుంచి కిందికి దూకి, ఒరలో నుంచి సర్రున కత్తి దూసి, "ఒరే రాక్షసా! చేవగలవాడవైతే, నాతో పోరాడి గెలిచి, నన్ను మింగు! అబలను మింగజూడడం సాహసం కాదు, అతి ఏహ్యమైన కార్యం," అన్నాడు ఖంగుమనే కంఠస్వరంతో.

రాక్షసుడు, చిత్రవర్ణుడికేసి వింత పడుతున్నట్టు చూసి, "నువ్వా, నాతో పోరాడి గెలిచే వీరుడివి! ఛీ, నోరుమూసుకో," అన్నాడు.

చిత్రవర్ణుడు అమితావేశంతో రాక్షసుణ్ణి సమీపించాడు. రాక్షసుడు వికవికమంటూ

నవ్వి, తన చేతిలోని కోయయువతిని నేలకు దించి, "జాగ్రత్త, పారిపోయే ప్రయత్నం చేసేవు!" అంటూ గుడ్లురిమి, చిత్రవర్ణుడితో, "నువ్వు బడుగు మనిషివి; నేను మహారాక్ష సుణ్ణి! అందులోనూ, రాక్షసుల్లో అగ్రజాతి వాణ్ణి. మేము ఒక్క ఆకలి గొన్నప్పుడు తప్ప, ఇతర సమయాల్లో ధర్మానువర్తులం. సమ ఉజ్జీల మధ్య పోరైతేనే విన ఇంపు, చూడ ముచ్చట!" అంటూ చిత్రవర్ణుడి దేహప్రమాణా నికి కుదించుకు పోయాడు.



ఇది చూసి చిత్రవర్ణుడు ఆశ్చర్యపోతున్నం తలో, రాక్షసుడు పెద్దగా నవ్వి, "నేను ఒక కత్తి సృష్టించు కోవాలంటే చాలా పెద్ద పని. సమయానికా మంత్రం కూడా గుర్తు రావడం లేదు. మల్లయుద్ధం చేద్దాం. ఆ కత్తి అవతల పారెయ్యి!" అన్నాడు తొడచరుస్తూ.

చిత్రవర్ణుడు కత్తిని నేలకు జార్చి, రాక్షసు డితో తలపడ్డాడు. కొద్దికాలం జరిగేసరికి, రాక్షసుడికి దేహబలం వున్నా, యుద్ధవిద్యలలో తగిన శిక్షణ లేనివాడు కావడంతో అలసిపో సాగాడు. ఇది గ్రహించిన చిత్రవర్ణుడు, అధను చూసి రాక్షసుడి గుండెల మీదా, కంఠం మీదా వజ్ర ఘాతం లాంటి పిడికిటి పోట్లు ప్రయో గించాడు.

రాక్షసుడు బాధతో అరుస్తూ కిందపడి చప్పున లేచి, "ఆహా! నువ్వు ధైర్యశాలివే కాదు, మహాబలశాలివి కూడా!" అంటూ మాయమైపోయాడు.

ఆ వెంటనే కోయయువతి రాజు పాదా లపై వాలిపోయి, "దొరా! నా పేరు గిరిక. కోయపెద్ద కూతుర్ని. అడవిమల్లెల కోసం వచ్చి, రాక్షసుడికి చిక్కిపోయాను. మీరు రక్షించారు. రాక్షసుడంత వాణ్ణి ఎదిరించిన, మీవంటి మహాశూరులు లోకంలో మరొక రుండరు!" అన్నది.

రాజు చిరునవ్వుతో, ఆమె భుజాలు పట్టు కుని లేవనెత్తాడు. మెడలో పూసల దండలతో, తలమీద రకరకాల పక్షి ఈకలతో అలంకరిం చుకున్న, ఆ యువతి వనదేవతలా వున్నది. ఆమెను ఆపాదమస్తకం పరీక్షగా చూసిన రాజు, ఆమె అద్భుత సౌందర్యానికి మంత్రముగ్ధుడై పోయాడు.



కొద్ది క్షణాల తర్వాత చిత్రవర్ణుడు, తన దృష్టిని కోయయువతిపై నుంచి తిప్పుకుని, దాపులనున్న కాళికాదేవి ఆలయం కేసి బయలుదేరుతూ, "గిరికా! నేను దేవిని పూజించేందుకు వచ్చాను. ఇక నువ్వు, మీ గూడేనికి వెళ్ళు," అన్నాడు.

అయినా, గిరిక, రాజు వెనకగా నడిచి, కాళీదేవాలయంలో ప్రవేశించి, ఆయనతో పాటు దేవిని ప్రార్థించిది. రాజు బయటికి వచ్చి, తను ఎక్కి వచ్చిన గుర్రం వున్న చోటుకు నడుస్తూండగా, ఆమె అతణ్ణి అనుసరించి రాసాగింది.

చిత్రవర్ణుడు, గిరిక ఏదో చెప్పడానికి తటపటాయిస్తున్నట్టు గ్రహించి, "గిరికా! నీలో నువ్వే ఏదో మథనపడుతున్నట్టున్నావు. చెప్పదలుచుకున్నదేదో నిర్భయంగా చెప్పు. నేనీ దేశాన్నేలే రాజు చిత్రవర్ణుణ్ణి," అన్నాడు.

అది విని గిరిక ఒక క్షణం నివ్వెరపోయి, "మీరు మహారాజులని ఇప్పటివరకూ గ్రహించలేకపోయాను. మీరా దేవిని ఏమని ప్రార్థించారో, నాకు తెలియదు. నేను మాత్రం మహాశూరులైన మిమ్మల్నే నా భర్తగా ప్రసాదించమని వేడుకున్నాను," అన్నది నిరాశగా.

రాజు క్షణకాలం తెల్లబోయి, అంతలోనే తేరుకుని ఏదో చెప్పబోయేంతలో, ఒక పాతికేళ్ళ కోయయువకుడు అక్కడికి వస్తూ, "గిరికా, నువ్విక్కడున్నావా? నీకోసం ఈ చుట్టుపక్కల అంతా గాలిస్తూ వస్తున్నాను," అన్నాడు ఆదుర్దాగా.

గిరిక ఆ యువకుడికి జరిగిందంతా చెప్పి, "రాక్షసుడి నుంచి నన్ను రక్షించిన వీరు, మనదేశాన్నేలే మహారాజులు!" అన్నది.

కోయయువకుడు, రాజుకు నమస్కరించి, "మహారాజా! గిరికను రక్షించి, నాకు చాలా మేలు చేశారు. రాక్షసుడు గిరికను మింగివుంటే, నేను ఆత్మహత్య చేసుకునే వాణ్ణి. గిరిక లేనిదే నేను క్షణంకూడా బతకలేను," అన్నాడు.

రాజు మందహాసం చేసి, "అలాగా! నువ్వు గిరికను ప్రేమించిన సంగతేమోకాని, గిరిక మాత్రం నన్ను ప్రాణప్రదంగా ప్రేమిస్తున్నది!" అన్నాడు.

"ఔనా, గిరికా!" అన్నాడు కోయయువకుడు బొంగురుపోయిన గొంతుతో.

గిరిక అవునన్నట్టు తల ఊపింది. రాజు దీర్ఘంగా ఒక నిట్టూర్పు విడిచి, కోయయువకుడితో, "ఈ చిక్కు సమస్యకు ఒక్కటే పరిష్కార మార్గం వున్నది. నేను రాక్షసుణ్ణి ఓడించిన మాట నిజమే కాని, నిన్ను ఓడించలేదు. నువ్వు మల్లయుద్ధంలో నన్ను ఓడించగలిగితే, గిరిక నీదవుతుంది," అన్నాడు.

ఇందుకు కోయయువకుడు సంతోషంగా సరేనన్నాడు.

రాజు, గిరికను, "ఈ పద్ధతి నీకు ఇష్టమే గదా?" అని అడిగాడు.

గిరిక ఇష్టమే నన్నట్టు తలవూపింది. మరుక్షణం రాజూ, కోయయువకుడి మధ్య మల్లయుద్ధం ప్రారంభమైంది. నాలుగైదు నిమిషాలు గడిచే లోపల, కోయయువకుడు, రాజు డొక్కమీద బలమైన ముష్టిఘాతం ఇచ్చాడు. రాజు చిన్నగా అరిచి కిందపడి స్పృహ కోల్పోయాడు.

కొద్దిసేపు తర్వాత చిత్రవర్ణుడు స్పృహలోకి వచ్చి లేచి నిలబడి, "గిరికా! నేను ఓడాను. నువ్వు మీ బావను పెళ్ళాడి సుఖంగా వుండు," అని వెంటనే గుర్రమెక్కి రాజధానికి బయలుదేరాడు.

ఇది జరిగిన కొన్నాళ్ళకు, చిత్రవర్ణుడు పుట్టిన రోజు సందర్భంగా రాజధానీ నగరంలో, యుద్ధవిద్యలలో రకరకాల పోటీలు ఏర్పాటయ్యాయి. పోటీలలో గెలుపొందిన వారికి, విలువైన బహుమతులు ప్రకటించాడు, రాజు.





పోటీల ముగింపు రోజు జరిగిన మల్ల యుద్ధం పోటీలలో, గిరిక బావ అయిన కోయయువకుడు, రాజాస్థానంలోని మల్లు లందరనీ ఓడించి విజేతగా నిలిచాడు. ఇంతలో కోయయువకుడికి బహుమతి ప్రదానం చేయవలసిన రాజు చిత్రవర్ణుడే, కోయయువకుడితో మల్లయుద్ధం పోటీకై బరిలోకి దిగాడు!

రాజు ప్రవర్తనకు పౌరులేకాక, పోటీలు చూడ వచ్చిన గిరిక కూడా ఆశ్చర్యపోయింది. అయితే, ఈ పోటీలో తన బావ తప్పక నెగ్గు తాడని భావించిన గిరిక, పోటీని కుతూ హలంగా చూడ సాగింది. కాని, చిత్రవర్ణుడి లాఘవం, శక్తి సామర్థ్యాల ముందు కోయ యువకుడు నిలవలేక పోయాడు. క్షణాలలో రాజు, కోయయువకుణ్ణి మట్టికరిపించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, కోయ యువతి గిరిక విషయంలో, చిత్రవర్ణుడు ప్రవర్తించిన తీరు చూస్తే, అతడిలో సమయ స్ఫూర్తి మృగ్యమనీ, నిలకడలేని బుద్ధి కల వాడనీ తెలుస్తున్నది గదా? ప్రథమంగా, అతడు గిరిక సౌందర్యానికి ముగ్ధుడవడం వల్లనే, అతడామె నుంచి దృష్టి మరల్చుకో లేక పోయాడు. అంటే — ఆమెను తన భార్యగా చేసుకోవాలనే కాంక్ష అతడిలో వున్నట్టు విదిత మవుతున్నది.అయితే, సమ యానికి కోయయువకుడు వచ్చి, గిరిక పట్ల తన ప్రేమ గురించి చెప్పడంతో తన బుద్ధి మార్చుకున్నాడు. ఇకపోతే, అతడి శూరత్వం గురించి: రాక్షసుడు న్యాయం ఆలోచించి, తనకు తానై శరీరాన్ని కుదించు కోకపోతే, రాజతణ్ణి మల్లయుద్ధంలో ఓడించ గలిగేవాడు కాదు. అన్నిటికన్న రాజు నిల కడలేని బుద్ధికి సాక్ష్యం, అతడు మల్ల యుద్ధంలో అందరినీ ఓడించిన కోయ యువకుడిపై మల్లయుద్ధానికి దిగి, అతణ్ణి ఓడించడం. ఇది గిరికను పెళ్ళాడిన కోయ యువకుడిపై, రాజు చిత్రవర్ణుడికిగల అక్క సునూ, అసూయనూ వెల్లడించడం లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు చిత్రవర్ణు డికి, అరణ్యంలో కోయయువతి గిరికతో పరిచయం అయినప్పటి నుంచీ జరిగిన సంఘటనలను, వేటికవేగా కాక, అన్నిటినీ సూత్రబద్ధం చేసి ఆలోచించాలి. రాక్షసుడు మహాకాయంతో భీకరరూపంలో వున్నప్పుడే, చిత్రవర్ణుడు అతడిపై కత్తి దూశాడు. దీనిని బట్టి అతడు మహాశూరుడనే దాంట్లో శంకకు తావు లేదు. రాక్షసుడు తన రూపాన్ని కుదిం చుకోవడం అదంతా వాడు నమ్మిన ధర్మ సూక్ష్మానికి సంబంధించినది మాత్రమే. ఒక యువతి అతిలోక సౌందర్యాన్ని చూసి ముగ్ధు డైనంత మాత్రాన, రాజామెను వివాహ మాడా లనుకున్నాడనడం, సమంజసం కాదు. అదే నిజమైతే చిత్రవర్ణుడు, కోయయువకుణ్ణి ఓడించి, గిరికను తనదిగా చేసుకోవడం ఏమంత కష్టం కాదు. గిరికకు, మహాశూరు డన్న భావంతో తనపై కలిగిన ప్రేమకు స్వస్తి చెప్పించేందుకే రాజు, కోయయువకుడిపై ఓడాడనేది సహేతుకం. తర్వాత అతడు పోటీ లలో కోయయువకుణ్ణి సునాయాసంగా ఓడిం చడం, రాజతంత్రానికి సంబంధించినది. అలా చేయకుండా, పోటీలలో గెలిచిన కోయ యువకుడికి చిత్రవర్ణుడు బహుమతీ ప్రదానం చేసివుంటే — వాడు ఏదో ఒక సమయంలో, తాను రాజును అరణ్యాన మల్లయుద్ధంలో చిత్తుగా ఓడించానని ఇతర్లతో చెప్పే అవకాశ మున్నది. ఒక దేశానికి రాజైన వాడికి అంత కుమించిన అవమానం, తలవంపులు కలిగిం చేదీ మరొకటుండదు. అందుకే, చిత్రవర్ణుడు అందరి సమక్షంలో కోయయువకుణ్ణి ఓడించి, వాడికి గతంలో తన ప్రతాపాన్ని గురించి ప్రచారం చేసుకునే అవకాశం లేకుండా చేశాడు. ఈ వాస్తవాన్నంతా గుర్తించినప్పుడు చిత్రవర్ణుడు సమయస్ఫూర్తి, దృఢస్వభావం కలవాడనీ, మహాశూరుడనీ, కేవలం వ్యక్తి పర మైన అసూయా, ప్రతీకార వాంఛలు లేనివా డనీ తెలుతుంది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : ఆర్. పట్టాభిరామ రాజు రచన]



# అక్షరాలా నిజం!

విశ్వాపురం జమీందారు వెంగళరాయుడు కాస్త మందమతి. ఒకనాడాయన తన మిత్రుడైన మరొక జమీందారు భూపాలరాయుడితో చదరంగం ఆడబోతూండగా ఒక మనిషి వచ్చి, "అయ్యా! నేనొక మావటివాణ్ణి. నా దగ్గర ఒక ఏనుగు వున్నది. ఈమధ్య దానిమీద వచ్చే ఆదాయం బాగా తగ్గిపోగా, దాని పోషణభారం పెరిగింది. దానిని మీవంటి ప్రభువులకు అమ్మాలనుకుంటున్నాను," అన్నాడు.

ఇది విన్న వెంగళరాయుడు ఏంచేద్దామన్నట్టు మిత్రుడికేసి చూశాడు.

"ఆలోచిస్తావెందుకు? ఏనుగు బతికున్నా, చచ్చినా వెయ్యే అన్నారు కదా!" అన్నాడు భూపాలరాయుడు.

"అంటే ఏమిటి?" అని ప్రశ్నించాడు వెంగళరాయుడు.

"ఏనుగు బతికున్నప్పుడు మనకు ఉపయోగించే ఎన్నో పనులు సునాయాసంగా చేయగలదు. చచ్చినప్పుడు దాని దంతాలమ్మినా లాభంగానే వుంటుంది," అన్నాడు భూపాలరాయుడు.

వెంగళరాయుడు ఏనుగును కొన్నాడు. కొంతకాలం గడిచింది. ఒకనాడు భూపాలరాయుడు, వెంగళరాయుణ్ణి చూసి పోదామని వచ్చాడు. ఆ సమయంలో చచ్చిపోయిన ఏనుగును కొందరు నౌకర్లు కోటద్వారం నుంచి బయటికి ఈడుస్తున్నారు.

వెంళరాయుడు తన మిత్రుడికి ఏనుగును చూపిస్తూ, "ఆడ ఏనుగుకు దంతాలుండవని నాకు ముందే ఎందుకు చెప్పలేదు? అయినా ఏనుగు చచ్చినా, బతికినా వెయ్యేనన్న నీ మాట అక్షరాలా నిజం! ఇది బతికుండగా నెలకు ఎంత లేదన్నా వెయ్యి రూపాయల తిండి తినేది. ఇప్పుడది చచ్చాక ఊరు బయటికి లాగి పాతి పెట్టించేందుకు వెయ్యి రూపాయలకు పైనే ఖర్చవుతుంది!" అన్నాడు కళ్ళు తుడుచుకుంటూ.

— వక్కలంక 'కిషోర్'



# చందమామ అనుబంధం - 60

మనదేశపు పక్షులు-జంతువులు:

## చమరమృగాలు

పశువుల జాతికి చెందిన, కొండలలో నివసించే చమరమృగాలను (యాక్) 'కొండ ఆవులు' అని చెప్పవచ్చు. ఇవి మన దేశంలో కాశ్మీరు నుంచి శిక్కిం వరకు గల హిమాలయపర్వత సానువులలో ఎక్కువగా నివసిస్తున్నాయి.

ఇవి పరిమాణంలో మామూలు ఆవుల కన్నా పెద్దవి గానూ, చాలా దృఢంగానూ ఉంటాయి. సాధారణంగా ఇవి 170 నుంచి 185 సెం.మీ. ఎత్తు వరకు ఎదుగుతాయి. కొండలను సునాయాసంగా ఎక్కుతాయి. ఇవి సముద్ర మట్టానికి 4.300 – 6,000 మీటర్ల ఎత్తులో నివసిస్తున్నాయి. నల్లగా ఉండే వీటి శరీరాల నిండా దట్టంగా పొడవాటి రోమాలు ఉంటాయి. ఈ రోమాల కారణంగానే ఈ జంతువులు విపరీతమైన చలిని తట్టుకోగలుగుతున్నవి.

ఒకప్పుడు అరణ్యాలలోనే ఉండే ఈ చమరమృగాలను ఇప్పుడు ఇళ్ళల్లో పాడి కోసం పెంచుతున్నారు. వీటిని బరువులు మోయడానికీ, ఎక్కి ప్రయాణం చేయడానికీ ఉపయోగిస్తున్నారు.

మామూలుగా కలిసి జీవించే స్వభావం గల చమరమృగాలు చిన్న చిన్న గుంపులుగా నివసిస్తాయి. ఆవులూ, చమరమృగాలూ కలిసిన ఒక విధమైన సంకరజాతి చమరమృగాలు కూడా అక్కడక్కడ ఉన్నాయి. వీటిని 'మెధ్యాన్' అని అంటారు.






# అవనీంద్రనాథ్ టాగూర్

"అందమైన ప్రకృతి దృశ్యాలను చిత్రీకరించడానికి మీరు ఏ ఉద్యానవనానికో, లేదా నదీ తీరానికో వెళ్ళి కూర్చుని, అక్కడి చెట్టుచేమలనూ, పువ్వులనూ, పరిశీలించి చూసి వాటిని యథాతథంగా చిత్రించడం గమనించాను. ప్రకృతి సౌందర్యాన్ని అలా చౌకగా పట్టి బంధించడానికి మీరు చేసే ప్రయత్నం నాకు ఆశ్చర్యం కలిగిస్తుంది. అందం అంటే కేవలం బాహ్యమైనది కాదు; అది హృదయాంతరాలలో దాగి ఉంటుందని మీరు గ్రహించాలి. మహాకవి కాళిదాసు కవిత్వంతో మీ హృదయాలను పరవశింప జేసి, ఆకాశం కేసి చూడండి. అప్పుడు అర్థమవుతుంది — వినీల గగనంలో తేలే మేఘాల అమర సందేశం. మొదట ఆదికవి వాల్మీకి సముద్ర వర్ణనలను చదివి ఆనందించి, ఆ తరవాత మీ సొంత సముద్రాలను చిత్రీకరించడానికి ప్రారంభించండి!"

ప్రముఖ చిత్రకారుడు అవనీంద్రనాథ్ టాగూర్ తమ శిష్యులకు ఇచ్చిన సలహా ఇది. ఆ సలహాలోనే ఆయనకు చిత్ర కళ పట్ల ఉన్న అభిప్రాయం వ్యక్తమవుతున్నది.



మన సాంస్కృతిక సంపదను, వారసత్వాన్ని అర్థంచేసుకుని ఆస్వాదించగలిగినప్పుడే మనం చిత్రించే చిత్రాలలో జీవకళ, ఉట్టిపడుతుందని ఆయన భావించాడు.

విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ సోదరుడి కుమారుడు అవనీంద్రనాథ్ టాగూర్. టాగూర్ కుటుంబం ప్రపంచ వ్యాప్తంగా వివిధ రంగాలకు చెందిన ప్రముఖులను ఆకర్షిస్తూన్న కాలఘట్టంలో,

అంటే 1871వ సం॥ లో అవనీంద్రనాథ్ టాగూర్ జన్మించాడు. ఆయన తొలి దశలో ఆంగ్లేయ, ఇటలీ చిత్రకారుల చేత ప్రభావితుడయ్యాడు. పాశ్చాత్య చిత్ర కళను అనుకరించడానికి ప్రయత్నించసాగాడు. భారతీయ కళా సంపదను ప్రపంచమే కాకుండా, భారతీయులు సైతం గుర్తించి, గౌరవించే విధంగా చేసిన పండితుడు, కళా విమర్శకుడు హెచ్.బి. హావల్. అవనీంద్రకు హావల్‌తో పరిచయం కలిగింది. అప్పటి నుంచి అవనీంద్ర భారతీయ చిత్ర కళా వైశిష్ట్యాన్ని కనుగొని పెంపొందించ డానికి తన ప్రతిభా పాటవాలను వినియోగించాడు. పాశ్చాత్య చిత్రకారుల శైలిని అనుకరించినప్పటికీ ఆయన భారతీయ సంస్కృతీ విశేషాలనే తన చిత్రాలలో ప్రధాన అంశాలుగా తీసుకునేవాడు.



ఆయన 'ఇండియన్ సొసైటీ ఆఫ్ ఓరియంటల్ ఆర్ట్' అనే సంస్థను స్థాపించాడు. ఆయన నుంచి పలువురు వర్ధమాన చిత్రకారులు ప్రేరణ పొందారు. వారిలో నందలాల్ బోస్ ముఖ్యుడు.

1951వ సం॥ లో అవనీంద్రనాథ్ టాగూర్ కాలధర్మం చెందాడు.

# మీకు తెలుసా?

1. మన దేశంలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ ఏ సంవత్సరంలో జరిగింది?
2. గత పదిసంవత్సరాలుగా అణ్వాయుధరహితప్రాంతంగా ఉంటూన్న దేశం ఏది?
3. 'పంచతంత్ర' కథలు ఏ రాజు కాలంలో సంకలనం చేయబడినవి?
4. 'ప్రకృతి ప్రపంచ నిధి' తన చిహ్నంగా స్వీకరించిన జంతువు ఏది?
5. మన దేశంలో రైలు పెట్టెల కర్మాగారం ఎక్కడ ఉన్నది?
6. అతి తక్కువ వాతావరణ కాలుష్యాన్ని కలిగించే వాహనం ఏది?
7. బొగ్గుగనులు ఎక్కువగా గల రాష్ట్రం ఏది?
8. 'బ్లూ చిప్' అంటే ఏమిటి?
9. 'దేవేంద్రుడి' రాజధాని ఏది?
10. ఇరాన్‌లో అయొతుల్లా ఖొమైనీ ఎప్పుడు అధికారాన్ని చేపట్టాడు?
11. మనదేశంలో వంద సంవత్సరాలకు పైగా వెలువడుతున్న వార్తాపత్రికలు ఎన్ని?
12. 'క్విట్ ఇండియా' పిలుపు ఎప్పుడు ఇవ్వబడింది?
13. 'దేవనాగరి' లిపిలో నాణేలు వెలువరించిన మొట్టమొదటి ముస్లిం రాజు ఎవరు?
14. ఐరోపాఖండంలోని అతి పెద్ద నది ఏది?
15. 'హరిత విప్లవం' అంటే మన దేశంలో ముఖ్యంగా ఏ పంటను సూచిస్తుంది?
16. గ్రహాలలోకెల్లా చాలా పెద్దది ఏది?

# సమాధానాలు

1. 1956 సం॥లో.
2. న్యూజీలాండ్.
3. చంద్రగుప్త విక్రమాదిత్యుడి కాలంలో.
4. 'పాండా'.
5. మద్రాసులోని పెరంబూరు.
6. సైకిలు.
7. బీహార్.
8. సక్రమంగా అభివృద్ధి చెందుతున్న పెద్ద కంపెనీ 'షేర్'.
9. అమరావతి.
10. 1979వ సం॥లో.
11. 36.
12. 1942వ సం॥ఆగస్టు8.
13. షేర్‌షా.
14. ఓల్గానది.
15. గోధుమ.
16. గురుగ్రహం (భూమి కన్నా 11 రెట్లు పెద్దది).



# కార్యసాధకుడు

శ్రీకంఠుడనే జమీందారుకు వ్యవసాయపు పనులు పర్యవేక్షిస్తూ, దానితోపాటు దివాణానికి వచ్చేపోయే వారిని గమనిస్తూ, బాధ్యతా, తగిన మర్యాదలతో ప్రవర్తించగల సమర్థుడైన వ్యక్తి కావలసి వచ్చాడు. ఆనాటి వరకూ ఇలాంటి పనులను ఎంతో నేర్పుగా నిర్వహిస్తూ వచ్చిన నారాయణయ్య హఠాత్తుగా కాలధర్మం చెందడంతో, జమీందారుకు ఈ సమస్య ఎదురయింది.

ఆయన దీన్ని గురించి దివానుతో ప్రస్తావించాడు.

దివాను ఒకక్షణం ఆలోచించి, "అయ్యా! ఈ పనికి నారాయణయ్య కొడుకు శశాంకుడు తగినవాడని నా నమ్మకం," అన్నాడు.

ఆ మర్నాడే శశాంకుడు, జమీందారును దర్శించి, తన తండ్రి స్థానంలో తనను నియమించవలసిందిగా కోరాడు. శశాంకుడిలోని తెలివితేటలు, కార్యదక్షత ఆధారంగా మాత్రమే వాడిని పనిలోకి తీసుకోవాలని నిర్ణయించుకున్న జమీందారు, వాడిని తిరిగి రెండురోజుల తర్వాత రావలసిందిగా చెప్పాడు.

జమీందారు చెప్పిన విధంగా, శశాంకుడు రెండు రోజుల తర్వాత ఆయన దగ్గిరకు వచ్చాడు.

జమీందారు వాడితో, "నీకు ఉద్యోగం ఇచ్చే సంగతి తర్వాత ఆలోచిస్తాను. ముందు నువ్వొక పని చెయ్యాలి. ఈనాటి సాయంత్రం మా అమ్మాయి అత్తవారింటికి వెళ్ళిపోతున్నది. ఆమె కోసం ఒక నగ తయారు చేయమని, పట్టణంలోని వర్తకుడికి పురమాయించాను. నగ ఈ ఉదయమే అందింది. నగను చూసి అమ్మాయి, దానిలో కొన్ని మార్పులు చేసినట్టయితే మరింత అందంగా కనబడుతుందని చెబుతున్నది. నువ్వు తక్షణం వెళ్ళి, అమ్మాయి చెబుతున్న మార్పులు చేయించుకుని రావాలి. అమ్మాయి అత్తవారింటికి

వారణాశి శ్రీరామక్రిష్ణ



బయలుదేరి వెళ్ళేలోగా, నువ్వు పని ముగించుకుని తిరిగిరావాలి. సమయం చాలా తక్కువగా వుంది," అన్నాడు.

శశాంకుడు, జమీందారు కూతురును అడిగి నగలో చేయవలసిన మార్పులు తెలుసుకుని, పట్టణం వెళ్ళి నగల వర్తకుణ్ణి కలిశాడు.

వర్తకుడు, శశాంకుడు చెప్పింది విని, "నువ్వు చెబుతున్న జమీందారెవరో నాకు గుర్తు లేదు. మా దుకాణం ప్రసిద్ధి నీకు తెలిసే వుండాలి. ఇక్కడి కెందరో జమీందార్లూ, రాజోద్యోగులూ, గొప్ప భూస్వాములూ నగలు కొనేందుకు వచ్చి పోతూంటారు. ఏదేమైనా, మా దుకాణంలో కొన్న నగలకు తగు మార్పులు చేసి ఇవ్వడం, మా విధి. అయితే, ఈ నగ మా దగ్గిరే కొనుగోలు చేసినట్టుగా, డబ్బు ఇచ్చినప్పుడు మేమిచ్చిన చెల్లు చీటీ చూపవలసి వుంటుంది!" అన్నాడు.

జమీందారు, శశాంకుడికి అలాంటి చీటీ ఏమీ ఇవ్వలేదు. దానికోసమై తిరిగి జమీందారు వద్దకు వెళ్ళడం అంటే శ్రమతో పాటు కాలం వృథా. ఆయన చెప్పిన సమయానికి పని పూర్తికాదు!

ఇలా ఆలోచించి శశాంకుడు మరొకసారి వర్తకుణ్ణి అడిగి చూశాడు. అయితే, వర్తకుడు తల అడ్డంగా ఆడించి, "మా దగ్గిర కొనుగోలు చేసిన నగలకే, మీరు కోరిన మార్పులు తక్షణం చేసి ఇచ్చే అవకాశముంది. చూస్తున్నావు గదా, నాదుకాణానికి మితిమీరిన పని ఒత్తిడి. ఇతరులవద్దకొన్న నగలను, మా వద్ద మార్పు చేయించాలంటే, కనీసం వారం రోజులైనా వ్యవధి కావాలి. నేను ముందుగా, నా ఖాతాదారుల పని చూడాలి. అది నా ధర్మం," అన్నాడు.

శశాంకుడు, వర్తకుడి మాటలు విని బాగా ఆలోచించి, "సరే! ఈ నగను అమ్మ దలిచాను. కొనేందుకు మీకేమైనా అభ్యంతరమా?" అని అడిగాడు.

"ఎంత మాట! మా తాతముత్తాతల ముందు తరాలనుంచి కూడా, మేం నగల వ్యాపారం చేస్తున్నాం. మా ఇంటి పేరే నగలవారు. నగల అమ్మకం, కొనుగోలే మా వంశంవాళ్ళ వృత్తి. నగకొనేందుకు అభ్యంతరమా!" అంటూ వర్త

కుడు ఆశ్చర్యపోయి, శశాంకుడి నుంచి నగ కొని, వెంటనే డబ్బు చెల్లించి, దాన్ని అమ్మకానికి సిద్ధంగా వున్న ఇతర నగల సరసన వుంచాడు.

శశాంకుడు డబ్బు తీసుకుని కొంత దూరం వెళ్ళి, ఏదో ఆలోచన వచ్చినవాడిలా తిరిగి వర్తకుడి దగ్గరకు వచ్చి, "అయ్యా! ఏదో క్షణికావేశంలోనో, తిక్కరేగో నగను అమ్మాను కాని, నిజంగా అమ్మాలని లేదు. ఇప్పుడు దాన్ని తిరిగి కొనాలని బుద్ధిపుట్టింది. అయితే, నగలో చిన్నచిన్న మార్పులు చేస్తే చాలు," అన్నాడు.

ఇది విని వర్తుకుడు తృప్తిగా తలాడించి, " మా దుకాణంలో నగను కొనుగోలు చేసిన మీలాంటి మాన్యులైన ఖాతాదారులకు, అడిగిన మార్పులు చేయడం, మా విధి!" అంటూ పనివాళ్ళను పిలిచి, శశాంకుడు చెప్పిన మార్పులు చేసి, నగను అమ్మకానికి సిద్ధం చేయవలసిందిగా ఆదేశించాడు.

పనివాళ్ళు కొద్దిసేపట్లోనే నగలో చేయవలసినమార్పులు చేసి, దానిని వర్తకుడి ముందుంచారు.

అప్పుడు వర్తకుడు, శశాంకుడితో, "అయ్యా! మేము నగను మీ దగ్గిర నుంచి కొనుగోలు చేసిన ధరకు, మేము అమ్మే ధరకు కొద్ది పాటి వ్యత్యాసం వుంటుంది. నగను తిరిగి కొనేందుకు వందరూపాయలు అదనంగా ఇప్పుడు ఇవ్వవలసి వుంటుంది," అన్నాడు.

నగలో మార్పులు చేర్పుల నిమిత్తం, మజూరీకోసమై జమీందారిచ్చిన వందరూపాయిలు శశాంకుడి దగ్గిర వున్నవి. ఆ డబ్బును, నగను అమ్మగా వర్తకుడిచ్చిన డబ్బుతో కలిపి, వర్తకుడి నుంచి నగను తిరిగి కొనుగోలు చేసి, అనుకున్న సమయానికి జమీందారింటికి చేరాడు శశాంకుడు.

నిజానికి జమీందారు – నగల వర్తకుడు బాగా పరిచయస్థులు. జమీందారు సూచన మేరకే వర్తకుడు, నగలో మార్పు చేయడానికి నిరాకరించాడు.

శశాంకుడి నుంచి జరిగినదేమిటో విన్న జమీందారు చాలాసంతోషించి, అతణ్ణి కార్య సాధకుడుగా గుర్తించి దివాణంలో తండ్రి చేసిన ఉద్యోగంలో నియమించాడు.





# శిల్పి - శిల్పకళ

ఒకానొకప్పుడు వింధ్య పర్వత ప్రాంతాల్లో శిలా నందుడనే శిల్పాచార్యుడుండేవాడు. ఆయన చెక్కిన శిల్పాలు జీవకళ ఉట్టిపడుతూ, శిల్పాలు కాదేమో అన్న భ్రమ కలిగించేవి.

డింభకుడు, కుంభకుడు అనే వారిద్దరు వెతుక్కుంటూ వెళ్ళి, శిలానందుడికి పది సంవత్సరాలపాటు శుశ్రూష చేసి శిల్పవిద్య లోని మర్మాలు తెలుసుకున్నారు.

విద్య పూర్తయి వెళ్ళి పోయేటప్పుడు శిల్పాచార్యుడు వాళ్ళతో, "నాయనలారా! మీ వంటి శిష్యులు నాకు దొరకడం నా అదృష్టం. మీరు మీకు తెలిసినదంతా మీ శిష్యులకు చెప్పండి. ప్రతిఫలాని కేనాడూ ప్రాముఖ్యతనివ్వకండి. వీలు చూసుకుని నేను ఒకసారి వచ్చి మిమ్మల్ని చూసి వెళ తాను," అన్నాడు.

డింభకుడు తన గ్రామం చేరుకున్నాడు. వాడికి అయిదెకరాల పొలం వున్నది. దానితో హాయిగా భుక్తి గడిచి పోతుంది. తను చెక్కే శిల్పాలకు ప్రేరణగా వుంటుందని నాట్య శాస్త్రం తెలిసిన మీనాక్షి అనే అందమైన యువ తిని డింభకుడు పెళ్ళాడాడు. వాడు చెక్కే శిల్పాలు చూసి అందరూ మెచ్చుకునేవారు.

ఎవరికైనా శిల్పాలు చెక్కాలంటే అందుకు డింభకుడు ప్రతిఫలం తీసుకునేవాడు కాదు. పైగా, వాడి వద్ద లెక్కలేనంత మంది శిష్యులుగా చేరారు. డింభకుడికి ఊపిరిసలపనంత పని వున్నా విసుగుదల వుండేది కాదు. ఊళ్ళోనూ, చుట్టుపక్కలా వాడి పేరు మారు మోగిపోతూండేది.

ఇలా కొద్ది సంవత్సరాలు గడిచాయి. ఒక రోజున ఆ దేశపు రాజు ఒక చాటింపు వేయించాడు: దేవనర్తకి అయిన మేనక శిల్పాన్ని అత్యద్భుతంగా చెక్కిన వారికి పది వేల వరహాలు కానుకగా ఇస్తాడట రాజు. ఆ శిల్పాన్ని ఆయన కొత్తగా నిర్మిస్తున్న నాట్య

జొన్నలగడ్డ రామలక్ష్మి

మందిరంలో ప్రతిష్ఠిస్తాడట. నాట్యమందిర నిర్మాణానికి శిల్పాలు కూడా కావాలని ఆయన చాటింపు వేయించాడు.

తన శిష్యులను నాట్యమందిర నిర్మాణానికి పంపి, తాను మేనక శిల్పాన్ని చెక్కడంలో నిమగ్నుడయ్యాడు డింభకుడు. కాని పది రోజుల్లోనే వాడి శిష్యులందరూ తిరిగి వచ్చేశారు. మందిర నిర్మాణానికి రాజు పెట్టిన పరీక్షల్లో వాళ్ళు నెగ్గ లేక పోయారట!

"విచారించకండి! మీ లోపాలు సవరించి క్రమంగా మిమ్మల్ని నా అంతటి వాళ్ళను చేస్తాను," అని వాళ్ళను ఓదార్చి, డింభకుడు మేనక శిల్పాన్ని చెక్కసాగాడు. అది పూర్తి కావడానికి మూడు మాసాలు పట్టింది.



మరో మాసం పాటు డింభకుడు శిల్పానికి తుదిమెరుగులు దిద్దాడు. ఈ లోగా రాజధానిలో నాట్యమందిరం కూడా సిద్ధంకానున్నదని వాడికి తెలిసింది. వెంటనే శిల్పాన్ని తీసుకుని ఎడ్ల బండిలో రాజధానికి ప్రయాణమయ్యాడు.

రెండు రోజులు ప్రయాణం చేశాక బండి కుంభకుడుండే గ్రామం చేరుకున్నది. అది పెద్ద గ్రామం. కుంభకుణ్ణి గురించి వెంటనే ఎవరూ చెప్పలేకపోయారు. చివరికొక యువకుడు, "ఆ బొమ్మలు చెక్కే వాడా? ఆయనతో నీకేం పని? ఆయన దగ్గర బొమ్మలు కొందామనుకుంటే నీ వల్లకాదు. ఆయనకు డబ్బాశ ఎక్కువ!" అంటూ ఇల్లు చూపించాడు.

కుంభకుడి ఇల్లు చూడ్డానికి సామాన్యంగా వున్నది కానీ, వాడు బాగా డబ్బు సంపాదిస్తున్నాడు. ఎవరికైనా శిల్పాలు చెక్కాలన్నా, తను చెక్కిన శిల్పాలు అమ్మాలన్నా వాడు చాలా పెద్ద మొత్తం అడుగుతాడు. శిల్పవిద్య నేర్పాలన్నాహెచ్చుమొత్తం అడుగుతూండడంవల్ల, వాడికి శిష్యులెందరో లేరు. వాళ్ళు కూడా ప్రస్తుతం రాజధానిలో నాట్యమందిర నిర్మాణంలో మునిగివున్నారు.

ఇదంతా గమనించి డింభకుడెంతో ఆశ్చర్య పడి, "మన విద్య పూర్తయి బయలుదేరేటప్పుడు గురువుగారు ప్రతిఫలానికి ప్రాముఖ్యతనీయవద్దని చెప్పాడు. గుర్తుందా?" అని కుంభకుడిని ప్రశ్నించాడు.



"గుర్తుంది. ఆయన మాట నాకు శిరోధార్యం. ప్రతిఫలం మీద ఆశవున్న వాడినైతే నేనెంతో ఆడంబరంగా జీవించేవాడిని. నా దగ్గర లక్షల వరహాలున్నా, నేను అతి సామాన్యంగా జీవిస్తున్నాను. మా ఇంట్లో అందరూ ఎవరి పనులు వాళ్ళు చేసుకుంటారు తప్ప, సేవకులను నియమించ మనరు," అన్నాడు కుంభకుడు.

వాడు పిసినిగొట్టువాడనీ, డబ్బు సంపాయించడమే కాక, పిల్లికి బిచ్చంకూడా వేయడనీ డింభకుడు అనుకున్నాడు. కానీ వాడా విషయాన్ని కుంభకుడి వద్ద ప్రస్తావించలేదు.

కుంభకుడు, డింభకుడిని ప్రేమాభిమానాలతో ఆదరించాడు. డింభకుడికి అక్కడున్న వారం రోజులూ స్వర్గంలో వున్నట్టుంది. తర్వాత ఇద్దరూ కలిసే రాజధానికి ప్రయాణమయ్యారు. కానీ, ఇద్దరూ ఒకరి శిల్పాల నొకరు చూడలేదు. వాటిని జాగ్రత్తగా గడ్డి, దూది నింపిన మూటలలో వుంచారు.

రాజధాని చేరుకున్నాక రాజును కలుసుకుని, వాళ్ళిద్దరూ తమ తమ శిల్పాలున్న మూటలను రాజుకు సమర్పించు కున్నారు. రాజు వారిని మర్నాడు రమ్మన్నాడు.

డింభకుడు, కుంభకుడు రాజేర్పాటు చేసిన విడిదిలో ఆరోజుకు విశ్రాంతి తీసుకున్నాక, మర్నాడు వెళ్ళి రాజును దర్శించారు. రాజు వారివంక అబ్బురంగా చూసి, "మీ ఇద్దరి శిల్పాలూ అద్భుతంగా వున్నాయి. అలాంటి శిల్పకళ మానవ సాధ్యం కాదు. అయితే, అచ్చుగుద్దినట్టు రెండు శిల్పాలూ ఒకే విధంగా వున్నాయి. నాట్యమందిరంలో రెండు స్థానాల్లో రెంటినీ ప్రతిష్ఠించాలని అనుకుంటున్నాను. కానీ, ఏది ఎవరిదో నాకు తెలియడం లేదు. మీరు గుర్తుపట్టి, వేరుచేసి నాకు చెప్పగలరా?" అని అడిగాడు.

శిల్పులిద్దరూ శిల్పాలున్న చోటుకు వెళ్ళి, తమ శిల్పాలను చూసి తెల్లబోయారు. అవి రెండూ ఒక్కలాగే వున్నాయి. ఏదెవరిదో చెప్పడం వాటిని చెక్కిన డింభకుడికీ, కుంభకుడికీ కూడా సాధ్యం కాలేదు.

"మీ రిద్దరూ సమాన ప్రతిభ గల శిల్పులు! ఒకరికి తెలియకుండా ఒకరు చెక్కిన శిల్పం

ఒకే లాగుండడం చాలా అరుదైన వింత. మిమ్మల్నిద్దర్నీ సమంగా సత్కరించడం, నా ధర్మం," అన్నాడు రాజు.

ఆ సమయంలో అక్కడికి శిలానందుడు వచ్చాడు. తన శిష్యుల ప్రతిభ చూడాలని ఆయన రాజధానికి చేరుకున్నాడు.

శిలానందుడు, రాజు చెప్పింది విని, "మీ సత్కారానికి అర్హుడు కుంభకుడు. డింభకుడి స్థానం ఆ తర్వాతది! వాళ్ళిద్దరూ నా శిష్యులు గనక, నా మాట కాదనరు," అంటూ తన అభిప్రాయం చెప్పాడు.

"మీ శిష్యులు మీ మాట కాదనరు. కానీ, కారణం తెలియకుండా నేను మీ అభిప్రాయాన్నెలా మన్నించేది?" అన్నాడు రాజు సంకోచంగా.

దీనికి శిలానందుడు, "రాజా, డింభకుడిలో అసమానమైన ప్రతిభ వుంది. కానీ, వాడికి విచక్షణ తెలియదు. అందువల్ల తన విద్యను అపాత్రదానం చేశాడు. ఎలాగంటే – అడిగారు కదా అని, అర్హతానర్హతలు చూడకుండా అడ్డమైన వారందరి శిల్పాలూ చెక్కి, శిల్పకళకు అపచారం చేశాడు. ఇక వాడివద్ద గుంపు ప్రమాణంలో చేరిన శిష్యుల గురించి. వాళ్ళల్లో ఎక్కువ మందికి శిల్పకళ పట్ల మోజు తప్ప, నిజమైన ఆసక్తి, అభిరుచీలేదు. అందువల్లనే, వాడి శిష్యులెవరూ మీ నాట్య మందిర నిర్మాణానికి ఎన్నిక కాలేక పోయారు. కళకుగల విలువను గ్రహించి పూజ్యభావంతో దాన్ని ఆరాధించే వాడే, కళాకారుడుగా సన్మానానికి అర్హుడు. పొగడ్త అనే ప్రతిఫలాన్ని ఆశించి అనర్హుల కోసం తన సమయాన్నీ, కళనూ దుర్వినియోగం చేసిన డింభకుడి కంటే, అనర్హులనూ, అపాత్రులనూ వదపోయడానికి మాత్రమే డబ్బును తీసుకునే కుంభకుడు సన్మానానికి తగినవాడు. వాడు స్వయంప్రతిభతో పాటు శిల్పకళకు ఎంతో న్యాయం చేకూర్చాడు," అన్నాడు.

రాజు, శిలానందుడు చెప్పినట్లే కుంభకుడికి ఘనంగా సన్మానం చేశాడు. డింభకుడందుకు చిన్నబుచ్చుకోలేదు సరికదా తనలోపాలేమిటో, మిత్రుడి గొప్పతనమేమిటో గ్రహించి తృప్తి చెందాడు. ఆ తర్వాత వాడు తన పద్ధతులు మార్చుకుని గొప్ప శిల్పిగా రాణించాడు.



# చందమామ కబుర్లు

## ప్రత్యేక విమాన ప్రయాణం!

అత్యవసరమైన పని మీద మీరు వెళుతున్నారు. బస్సు తప్పిపోతే మీరేం చేస్తారు? ఆటోగాని, టాక్సీగాని పట్టుకుని వెళతారు. మీరు ఎక్కవలసిన రైలు వెళ్ళి పోయిందనుకుందాం. పని మరీఅవసరమైనప్పుడు డబ్బుంటే విమానంలో వెళ్ళవచ్చు. ఒకవేళ విమానాన్నే వదిలేశారనుకోండి. అప్పుడేం చేస్తారు? అలాంటి పరిస్థితి ఎదురయినప్పుడు సౌదీ యువరాజు ప్రత్యేక విమానాన్ని ఏర్పాటు చేసుకుని మరీ వెళ్ళాడు. వాహనాల అంతరాయం అంటే, 'ట్రాఫిక్' కారణంగా ఆయన ప్యారీస్ విమాన నిలయం చేరుకునే సరికి న్యూయార్క్ వెళ్ళవలసిన విమానం వెళ్ళిపోయింది. తరవాతి ఫ్లైట్ 21/2 గంటల తరవాతే. అంతవరకూ అక్కడ కాలయాపన చేయడం ఇష్టం లేక యువరాజు 2,36,000 డాలర్లు చెల్లించి ప్రత్యేక విమానంలో 31/2 గంటలలో న్యూయార్క్ చేరుకున్నాడు!




ఒక బ్రిటిష్ సైనికుడు ఇంటి దగ్గర వున్న తన కళ్ళద్దాలు తెచ్చుకోవడానికి 30,000 కి.మీ. విమానంలో ప్రయాణం చేయవలసి వచ్చింది. అట్లాంటిక్, మహాసముద్రం సమీపంలో ఉన్న 'ఫాక్ ల్యాండ్స్' దీవుల్లో డ్యూటీలో ఉన్నాడు ఆ సైనికుడు. ఫుట్‌బాల్ ఆడేప్పుడు అతని కళ్ళద్దాలు పగిలిపోయాయి. అతడు కంప్యూటర్ ఎదుట కూర్చుని పని చేయవలసినవాడవడంతో అతనికి కళ్ళద్దాలు అవసరమయ్యాయి. దురదృష్టవశాత్తు ఆ దీవులలో కళ్ళద్దాలిచ్చే డాక్టర్ లేడు. కాబట్టి ఆ సైనికుడు ప్రత్యేక విమానం ఏర్పాటు చేసుకుని తమ ఇంటికి వెళ్ళి, కళ్ళద్దాలు తెచ్చుకోవడం తప్ప మరొక మార్గం లేకపోయింది!




## చుక్కలు, గీతలు మటుమాయం!

సముద్ర ప్రయాణంలో ఓడల మధ్య సందేశాలు పంపడానికి చుక్కలను, గీతలను సంకేతాలుగా వాడేవారు. దీనిని 'మోర్స్‌కోడ్' అనేవారు. ఉదాహరణకు మూడు చుక్కలు – మూడు గీతలు – మూడు చుక్కలు పంపినట్టయితే ఎస్.ఓ.ఎస్. అంటే 'సేవ్ అవర్ సోల్స్' (మమ్మల్ని కాపాడండి) అని అర్థం. ఈ పద్ధతి 20వ శతాబ్దారంభంలో ప్రవేశపెట్టబడింది. అయితే, ఇప్పుడు టెలిఫోన్లు, కంప్యూటర్‌లు, శాటలైట్‌ల ద్వారా ఒక ఓడ నుంచి మరొక ఓడలోకి క్షణాలలో సందేశాలు పంపడం సాధ్యమవుతున్నది. ఇది విజ్ఞాన శాస్త్రం సాధించిన అద్భుతం. ఈ కాలఘట్టంలో 'మోర్స్ కోడ్' ఉపయోగం లేకుండా పోయింది. దానికి ఆర్.ఐ.పి. (రెస్ట్ ఇన్ పీస్) అని చెప్పకుండానే ఉద్వాసన జరిగిపోయింది!




అయోధ్యలో ఒకనాడు రాముడు, మంత్రి సామంతాదులతో కొలువుతీరి ఉండగా, విశ్వామిత్ర మహర్షి చరచరా సభను ప్రవేశించి, "రామా! కాశికాపురి రాజైన యయాతి గర్వాంధుడై, నన్ను అవమానించాడు. ఆ రాజాధమున్ణి నీవు వెంటనే పరిమార్చాలి! గురువుగా ఇది నా ఆజ్ఞ!" అని చెప్పి, వచ్చినట్లే చరచరా వెళ్ళిపోయాడు.

విశ్వామిత్రుడి ఆజ్ఞకు రాముడు విస్తుపోయాడు.

యయాతి రాముడిపట్ల వినయవిధేయలతో కాశీరాజ్యాన్ని ధర్మం తప్పకుండా పాలిస్తూన్న సామంతుడైన రాజు. విశ్వామిత్రుడు తొలుత యాగరక్షణ కోసం రామలక్ష్మణులను తీసుకువెళ్ళి, రాముడికి ఎన్నెన్నో దివ్యాస్త్రాలను ఉపదేశించి బల, అతిబల మొదలైన విద్యలను ప్రసాదించిన గురుదేవుడు.

అయినా, ప్రజానురంజకుడై, తనపట్ల భక్తి కలిగివున్న యయాతిని ఎలా చంపడం? గురుదేవుడయిన విశ్వామిత్రుడి ఆజ్ఞను ఎలా త్రోసిపుచ్చడం?

రాముడు అప్పటికి సభ చాలించి, లేచి వెళ్ళి, అంతరంగిక మందిరానికి సుమంతుణ్ణి పిలిపించి, "సుమంతా! ఇది నా అంతరంగిక వ్యక్తిగత విషయం! నేను ఒంటరిగాపోయి యయాతిని వధించక తప్పదు. మే మిద్దరమూ ద్వంద్వయుద్ధం చేస్తాము. అంతకు మించి ఎటువంటి ప్రజాక్షయమూ జరగవలసిన పనిలేదు. రాముడు నిన్ను చంపడానికి బయలుదేరి వస్తున్నాడని యయాతికి వెంటనే

41. రామాంజనేయ యుద్ధం



వర్తమానం పంపించండి," అని స్థిరచిత్తంతో చెప్పాడు.

జరిగినదేమంటే — కాశీనగరాన్ని పాలిస్తున్న యయాతితో గ్రామీణ ప్రజలు వచ్చి, అరణ్యాల నుంచి ఏనుగుల మందలు, ఇతర భయంకరమైన వన్యమృగాలు తమ పల్లెలపై బడి అపార నష్టాన్ని కలిగిస్తున్నవని మొరపెట్టుకున్నారు. ప్రజల మొర ఆలకించినయయాతి వారి బాధలు పోగొట్టడానికి వేటాడ్డం కోసం బయలుదేరాడు. అప్పుడే విశ్వామిత్రుడు ఆ దారిన వస్తున్నాడు. వేట సంరంభంలో వేగంగా పరుగిడుతూన్న రథంలో కూర్చుని ఉన్న యయాతి విశ్వామిత్రుడి ఆగమనాన్ని గమనించక, వేటకు వెళ్ళిపోయాడు.

అది తనపట్ల ఘోరమైన అవమానంగా విశ్వామిత్రుడు భావించి, "తనను చూడగానే రథం దిగి ప్రణమిల్లి, భక్తి శ్రద్ధలు చూపవలసిన దానికి మారుగా, నన్నింత పరాభవించిన అహంకారీ, అధముడూ అయిన ఈ యయాతిని అంతమొందించకపోతే నేను విశ్వామిత్రుణ్ణే కాను!" అని ఘోర ప్రతిజ్ఞ చేసి, సరాసరి రాముడి దగ్గిరకు వెళ్ళి, ఆజ్ఞాపించి పోయాడు.

చారులు తెచ్చిన వర్తమానాన్ని అందుకొని యయాతి భయంతో తల్లడిల్లి పోయాడు. యయాతి భార్య యశోధర. ఆ దంపతులకు చంద్రాంగదుడనే చక్కని కుమారుడు, చంద్రముఖి అనే అందమైన కుమార్తె ఉన్నారు. ఆ కుటుంబానికి రాముడి యందు చాలా ఆరాధన ఉన్నది.

ఆ వార్త విని అందరూ ఒక్కసారిగా శోకసముద్రంలో మునిగిపోయారు.

కొంతసేపటికి యయాతి తెప్పరిల్లి, "శరణాగతుణ్ణి, నిరపరాధిని, నీ దయ అని నేనే రాముణ్ణి స్వయంగా వేడుకుంటాను," అని లేచాడు.

ఆ రాజూ, కుటుంబం అంతా కలిసి అయోధ్యకు వెళ్ళడానికి బయలుదేరుతూండగా,వారికి నారదుడు ఎదురయ్యాడు. నారదుడు యయాతిని చూసి విషయం అడిగి తెలుసుకుని ఫక్కున నవ్వి, "అమాయకుడా! ఆపత్కాలంలో, నీ వివేకం పూర్తిగా పోయింది

లాగుంది. ఒకే బాణం, ఒకే మాట అని పేరొందిన రాముడు, నిన్ను చూడగానే తప్పక వధించి తీరుతాడు. ఆలోచించడానికి వ్యవధి లేదు. అంజనాదేవి ఆశ్రమానికి తక్షణం వెళ్ళు. ఆమె అభయం కోరుకో. హనుమంతుడు ఆమె కుమారుడేగద, కొంత కాలంగా అతడు అక్కడే ఉంటున్నాడు," అని చెప్పాడు.

యయాతికి, నారదుడి మాటలు నచ్చాయి. వెంటనే అతడు అంజనాదేవిఆశ్రమానికి పరిగెత్తాడు.

ఆశ్రమంలోఅంజనాదేవి ధ్యానం ముగించి లేస్తూ, "శరణాగతుడను! రక్షించండి! ప్రాణ భీతితో, అభయం కోరి వచ్చాను!" అనే అర్త నాదం విని ఇవతలకు వచ్చింది. చేతులు జోడించి ప్రాణభీతితో కంపించి పోతున్న యయాతి కనిపించాడు.

"నాయనా, భయం విడిచిపెట్టు. నా కుమారుడి మీద ఒట్టు పెట్టి చెబుతున్నాను. నీ కెటువంటి ఆపదా రానీయను! ప్రాణ భయం వదిలి పెట్టు," అని అంజనాదేవి యయాతికి అభయమిచ్చింది.

అప్పుడే హనుమంతుడు గంధమాదన పర్వతం నుంచి వచ్చాడు. యయాతి, తల్లి కుమారులిద్దరి ముందూ ప్రణామాలు చేసి, "నా పేరు యయాతి, కాశీరాజును, రాముని యందు భక్తి ప్రపత్తులు గలవాడను. నన్ను రక్షించగలవారు, మీరు తప్ప మరెవ్వరూ లేరు!" అని తన గురించి భయంభయంగా చెప్పుకున్నాడు.





హనుమంతుడు యయాతిని భుజాలు పట్టి లేవనత్తి, "ఓ రాజా, ఇప్పుడేగదా, మా అమ్మ నీకు అభయమిచ్చింది! ఇంకా భయ పడతావెందుకు? నా తల్లి మాట తప్పక నిల బెట్టుతానని నేను కూడా ప్రతిజ్ఞ చేస్తున్నాను," అన్నాడు.

అప్పుడు యయాతి, "హయ్యో, ఓ ఆంజ నేయా! ఏమని చెప్పగలను? రాముడు నన్ను నిష్కారణంగా చంపబోతున్నాడు!" అని చెప్పి, జరిగినదంతా వివరించాడు.

హనుమంతుడు అంతా నిశ్చలంగా విన్నాడు.

అంజనాదేవి, "ఎంత పొరబాటు జరిగి పోయింది! నేను తెలియక అభయమిచ్చాను. అపరాధం జరిగిపోయింది," అని విచారించ సాగింది.

అప్పుడు హనుమంతుడు తల్లితో, "అమ్మా! ఇప్పుడు చింతించవలసినదేమీ జరగలేదు. ఆర్తులను రక్షించడం కంటే గొప్ప ధర్మం వేరేదీ లేదుగదా! ఈ యయాతికి నేను జీవించి ఉండగా ఎటువంటి హానీ జరగదు!" అని చెప్పాడు.

యయాతికి హనుమంతుడు అభయ ప్రదానం చేసిన సంగతి అందరికీ తెలిసింది. ఆ వార్త అయోధ్యకు శీఘ్రంగా చేరుకుంది. రాముడి చెవిని కూడా పడ్డది. అంతఃపురంలో సీతకు కూడా తెలిసింది.

అంతఃపురం మీదినుంచి సీతాదేవి చూస్తూండగా, ఇద్దరు పిల్లలతో వస్తున్న యశోధర కనిపించింది. యశోధర సౌధాన్ని సమీపించి, "అమ్మా, జానకీ! భిక్ష పెట్టించు! పతి భిక్షపెట్టించు, తల్లీ!" అని ఎలుగెత్తి అరిచింది.

"అమ్మా! నీ భర్త, హనుమంతుడి ఆశ్రయంలో క్షేమంగా ఉన్నాడని తెలిసింది. అతని కింక ఎటువంటి భయమూ ఉండదని నమ్ము. నీవూ, పిల్లలూ ఇక్కడే నాతో ఉండండి!" అని చెప్పి, సీత అంతఃపురంలో వారికి సకల మర్యాదలతో విడిది ఏర్పాటు చేయించింది. ఆ పిల్లలిద్దరికీ సీత దగ్గర మంచి చనువు ఏర్పడింది. అటువంటి పిల్లలిద్దరు తనకు ఉంటే బాగుండునని సీతకు సంతాన వాంఛ కలిగింది.

రాముడు ధనుర్బాణాలను ధరించి యయాతిని వధించడానికి పాదచారిగా బయలుదేరాడు. అతని వెనుక ముగ్గురు తమ్ములూ, వారివెంట మంత్రులూ, పరివారమూ బయలుదేరారు. రాముడు తప్ప ఎవ్వరూ ఎటువంటి ఆయుధమూ పట్టుకోలేదు. రాముడు దగ్గిరకు రాగానే హనుమంతుడు స్వాగతవచనాలు పలికి, దోసిట్లోని పువ్వులను, ఎంతో భక్తితో అతని పాదాల ముందు చల్లాడు.

హనుమంతుడు రాముడి పాదాల ముందు మోకరిల్లి, "రామా! యయాతిపై అనుగ్రహం చూపు! అతడు నిరపరాధి. బలహీనుడైన వాణ్ణి దండించడం నీవంటి వారికి తగదు. అతని పక్షాన నేను వేడుకొంటున్నాను," అని అన్నాడు.

రాముడు ఆగ్రహంతో, "ఓహో! నాకే చెప్పగలంతటి వాడివయ్యావా?" అంటూ హనుమంతుణ్ణి పాదంతో తన్నాడు. ఆ తాపుకు హనుమంతుడు పరవశించి పోతూ, "ఏ పాదం తాకగానే బండరాతికి శాపవిమోచనం కలిగి, అహల్యగా పవిత్రత పొందిందో, అటువంటి నీ పాదస్పర్శతో నా మేను ఇన్నాళ్ళకు ధన్యమైంది. ఇప్పుడు నా శరీరానికి అపూర్వమైన శక్తి వచ్చింది," అన్నాడు.

రాముడు తిరిగి మండిపడుతూ, "ఓరి వానరా! ఇంటువంటి కల్లబొల్లి పొగడ్తలు కట్టిపెట్టి, యయాతిని విడిచిపెట్టు. గురు



వాజ్ఞను నిర్వర్తించాలని నేను ఇక్కడకు వచ్చాను," అన్నాడు.

"రామా! నీ గురువు ఆజ్ఞ ఎంత అన్యాయమైనదో గుర్తించకుండానే, నిష్కారణంగా ఒక అమాయకుణ్ణి చంపాలని నీవు వచ్చావు! తల్లిమాట నిలబెట్టడం కోసం నేను యయాతికి రక్షగా నిలబడ్డాను. ముందు నన్ను చంపి, తర్వాత నీవు వచ్చిన పని చూసుకో!" అని హనుమంతుడు గంభీరంగా లేచి నిల్చున్నాడు. ఉన్నట్టుండి హనుమంతుడి శరీరం పెరగసాగింది. నిగనిగలాడుతూ ప్రకాశాన్ని విరజిమ్మసాగింది.

అది చూసి రాముడు, "ఓ, ఇంత వాడివయ్యావా? ఏదో ఒక వానరుడివనే అను



కున్నానుగాని, నా కెదురునిలిచేటంత వీరు డివి అవుతావని అనుకోలేదు!" అన్నాడు హేళ నగా.

"రామా! అది అంతా నీ పాద మహిమే అని ఇప్పుడే గద చెప్పాను!" అన్నాడు హను మంతుడు.

రాముడు ధనుస్సు తీసి బాణాన్ని సంధిం చాడు. హనుమంతుడు తన తోకను పెంచి గిరగిరా తిప్పుతున్నాడు. రాముడు ప్రయోగిం చిన అస్త్రాలన్నిటినీ హనుమంతుడు తోకతో అడ్డుకొని, గిరవాటేస్తున్నాడు.

ఆ సమయంలో విశ్వామిత్రుడు కూడా అంగలు వేస్తూ అక్కడకు పరుగు, పరుగున వచ్చాడు.

రాముడు వేసిన ఒక్కొక్క అస్త్రానికీ, హను మంతుడు శరీరాన్ని పెంచుతూ, మహోన్న తంగా పెరిగి పోయాడు. రాముడు వింటిని పైకెత్తి, నడినెత్తి ఆకాశానికి గురిపెట్టవలసి నంత పని అయింది. అప్పుడు హనుమం తుడు వీరాసనం వేసి కూర్చుని, "రామా! ఇప్పుడు నీ గురికి కొంత అందుబాటులో ఉంటాననుకుంటాను!" అన్నాడు.

రాముడు ఒక్కసారిగా మహోగ్రుడై, "ఇప్పుడు చిట్టచివరిగా నా రామబాణాన్ని, నీ గుండెకు గురిపెట్టి ప్రయోగిస్తున్నాను. దీనితో నీపనీ,నా పనీ ముగుస్తుంది," అంటూ చంద్రవంక ఆకారం గల రామబాణాన్ని తీశాడు.

విశ్వామిత్రుడు పరుగున వచ్చి రాము డితో, "రామా, ఇక నీవు యుద్ధం మాని హనుమంతుడి పట్ల ప్రసన్నుడివి కావాలని కోరుతున్నాను. నా అహంకారం, ఇదంతా చూశాక నశించింది. యయాతి దోషమేమీ లేదు," అన్నాడు.

రాముడు తల అడ్డంగా ఊపుతూ, "లేదు, గురుదేవా! ఇంకా నా అస్త్రం మిగిలే ఉన్నది. ఈ క్షణమే మీ ఆజ్ఞ నెరవేర్చి తీరుతాను, దయతలచి నన్ను వారించకండి," అని అన్నాడు.

రాముడు అస్త్రాన్ని నారికి సంధించి హనుమంతుడికి గురిపెట్టి, "హనుమా! నా రామబాణాన్ని నీ గుండెకు గురిపెడుతున్నాను;

ఇప్పుడైనా నీ అహంకారం విడిచి, యయాతిని నాకు అప్పగించి, రాముని బంటువనిపించుకో!" అన్నాడు.

హనుమంతుడు, "అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ నేను రాముని నమ్మిన బంటునే! శరణు ఇచ్చి వదిలివేసే క్షుద్రుడు నీకు బంటుగా ఉండతగడు. అది నీకే చిన్నతనం! త్వరగా నీ రామబాణాన్ని వదులు, హృదయపూర్వకంగా నీ బాణానికి స్వాగతమిస్తున్నాను," అంటూనే హనుమంతుడు రెండు చేతులతోనూ తన గుండెను చీల్చి అస్త్రానికి సూటిగా పట్టుకున్నాడు. రాముడు బాణాన్ని వదిలాడు. ఆ బాణం హనుమంతుడి గుండెలో చొరబడుతూ అదృశ్యమైంది. అప్పుడు హనుమంతుడి గుండెలో దేదీప్యమానంగా ప్రకాశిస్తూ రాముడి రూపం కనిపించింది. ఆ అద్భుతాన్ని అక్కడి వారంతా నిశ్చేష్టులై చూస్తూ ఉండిపోయారు.

రాముడు ధనుస్సు కిందకు దించి, "హనుమా! నువ్వు అజేయుడివి! నేనే ఓడిపోయాను!" అన్నాడు.

అప్పుడు హనుమంతుడు, గుండెను చీల్చి పట్టుకున్న చేతులు వదిలి పెట్టగానే, గుండె యధాప్రకారం మూసుకున్నది.

"రామా! ఇందులో జయాపజయాలు ఎవరివీ కావు. నీ అస్త్రాన్ని నా హృదయంలో ఉన్న నీవే గ్రహించావు. అది నీలోనే లీనమైంది. ఇందులో నా ప్రతాప మేమీ లేదు," అన్నాడు హనుమంతుడు తలవంచి నమస్కరిస్తూ.

విశ్వామిత్రుడు వచ్చి హనుమంతుణ్ణి దగ్గరకు తీసుకొని, "హనుమంతా! శరణాగత రక్షణలో నీవు, రాముడంతటి వాడితో ఎదురొడ్డి, ప్రతిజ్ఞాపాలన నెరవేర్చి, ఇప్పుడు అసలైన వీరుడివనిపించుకున్నావు. వీరహనుమానుడని సార్థక నామధేయుడివైనావు. నీ కీర్తి ముల్లోకాలలో చిరస్థాయిగా నిలిచి ఉంటుంది," అని ఎలుగెత్తి శ్లాఘించాడు.

రాముడికీ, పరివారానికీ చేతులెత్తి వందనాలు చేసి, వీడ్కోలు చెప్పి, హనుమంతుడు గంధమాదన పర్వతం మీద తపస్సులో నిమగ్నమయ్యాడు.






# గంగమ్మ గర్వభంగం

ఒక పల్లెటూరులో అనంతయ్య అనే రైతు ఉండేవాడు. అతనికి గంగమ్మ అనే చెల్లెలు ఉండేది. చెల్లెలంటే అనంతయ్యకు పంచ ప్రాణాలు, కాని గంగమ్మకు మొదటి నుంచీ గర్వం ఎక్కువ. ఆమెకు అన్నగారంటే కాస్త కూడా గౌరవం లేదు. అయితే, అనంతయ్య దాన్ని గురించి పట్టించుకునేవాడు కాడు. చెల్లెలు సుఖంగా ఉంటే చాలునని అనంతయ్య మంచి సంబంధం చూసి, తనకున్న రెండెకరాలూ వరకట్నం ఇచ్చి, గంగమ్మకు పెళ్ళి చేశాడు. తరవాత తానొక పేద ఇంటి పిల్లను చూసి పెళ్ళాడాడు.

గంగమ్మ కాపురానికి వెళ్ళింది, అనంతయ్య భార్య కాపురానికి వచ్చింది. అతనికి వరసగా పిల్లలు పుట్టుకొచ్చారు. సంసార భారం పెరిగిపోయింది. చివరికా కుటుంబ స్థితి ఎలా అయిందంటే, పనిచేసిన నాడు తిండీ, లేనినాడు పస్తూనూ.

పిల్లలు ఆకలికి అల్లాడుతుంటే, ఆ దంపతుల హృదయాలు కుమిలి కుమిలి ఏడ్చేవి. ఆడుతూ, పాడుతూ తిరగవలసిన పిల్లలు తిండి లేక ఎండిపోతుంటే, అనంతయ్యతో అతని భార్య ఒకనాడు, "ఇంత బాధపడుతున్నాం కదా, ఒక్కసారి మీ చెల్లెలి దగ్గిరికి పోయి రాకూడదా? తనకు తోచిన సహాయం చేస్తుంది," అన్నది.

"కావాలంటే పోయిరావచ్చు. కాని, వాళ్ళు మాత్రం ఏమంత కలవారని?" అన్నాడు అనంతయ్య.

"పోనీ, వెళ్ళి చూసి రండి. పెళ్ళయి అయిదు సంవత్సరాలయింది కదా. మన పరిస్థితి చూసి మీ చెల్లులు సహాయం చేస్తే సరేసరి, లేకపోతే చూసివచ్చెయ్యండి," అన్నది భార్య.

ఇక కాదనలేక అనంతయ్య మర్నాడు తెల్లవారు ఝామున, భార్య ఇచ్చిన గంజి

తాగి, గంగమ్మ అత్తవారి ఊరుకు బయలు దేరాడు. అతను పగలంతా నడిచి, సాయం కాలానికి ఈ వూరు చేరాడు. ఆ వచ్చే అన్న గారిని గంగమ్మ అంత దూరంలోనే చూసింది. అన్న కట్టుకున్న చింకి బట్టలూ, నూనె మొహం ఎరగని చింపిరి తలా, ఉపోషాలతో బక్క చిక్కి పోయిన శరీరమూ, గుంటలు పడ్డ కళ్ళూ చూసి గంగమ్మ చాలా అదురు కున్నది.

ఆమె అన్నను చూసి జాలిపడటానికి బదులు, "పచ్చగా ఉంటే దిష్టి పెట్టటానికి వస్తున్నాడు," అని తన మనస్సులో అను కుంది.

చెల్లెలు గుమ్మంలో నిలబడటం అనం తయ్య చూశాడు. మళ్ళీ చూసేటప్పటికామె కనిపించక పోయేసరికి, కాళ్ళకు నీళ్ళు తేవటానికి వెళ్ళిందనుకున్నాడు.

ఈ లోపల గంగమ్మ తన అన్నను ఎలాగైనా త్వరగా సాగనంపాలని నిశ్చయిం చుకున్నది. ఆమె లోపలికి వెళ్ళి, తాను కట్టు కుని ఉండిన వెలగల పట్టుచీర వెంటనే విప్పేసి, చిరుగులు పట్టి, వెలిసి పోయిన పాత చీర కట్టుకుని, మట్టి పిడతతో నీరు తీసుకుని విచారంగా బయటికి వచ్చింది.

ఒక్క నిమిషంలో తన చెల్లెలిలో కలిగిన మార్పు చూసి అనంతయ్య ఆశ్చర్యపోయి, ఒకవేళ తాను మొదట చూసినది మరొక మనిషేమోనని తన మనస్సు సరిపెట్టు కున్నాడు.



వాకిట నిలబడి ఉన్న అన్నగారిని చూసి గంగమ్మ తెచ్చిపెట్టుకున్న ఏడుపుతో, "ఇంత కాలానికి నేను జ్ఞాపకం వచ్చానా, అన్నయ్యా? సుఖపడతానని -నాకీ సంబంధం చేశావు గాని, అన్నయ్యా, తిండికి కూడా గతి లేక బాధపడుతున్నానన్నయ్యా!" అంటూ నీళ్ళ పిడత అందించింది.

అనంతయ్య తన చెల్లెలి పరిస్థితికి చాలా బాధపడ్డాడు. అతని ఆశలన్నీ నీరుకారి పోయాయి.

అన్నగారు ఇంట్లోకి వస్తే తన గుట్టు బయటపడుతుందని, గంగమ్మ బయటి అరుగు మీద ఒక కుక్కి మంచం వేసింది. దానిమీద తన దుప్పటి పరుచుకుని, అనంతయ్య నడుం వాల్చాడు.

పొలం నుంచి తన భర్త వచ్చే వేళ అయిందని గ్రహించి, అన్నకు తెలియకుండా గబగబా గంగమ్మ దొడ్డి దారిన అతనికి ఎదురువెళ్ళింది! అన్నగారు వచ్చినట్లు అతనికి చెప్పింది. రాక రాక, పెళ్ళి అయిన ఇంత కాలానికి బావమరిది తన ఇంటికి వచ్చాడని తెలిసి గంగమ్మ భర్త ఎంతో సంతోషించాడు.

తన ఉద్దేశం భర్త గ్రహించక పొయ్యే సరికి, "అది కాదండీ, మనకు డబ్బు వుందని తెలిస్తే సహాయం చెయ్యమంటాడు. అందుకని కాస్త కటిక పేదవాళ్ళలా నాటకం ఆడాలి," అన్నది.

"పాపం, రాక రాక వస్తే అదేమిటి?" అన్నాడు భర్త.





"నా సొంత అన్నగారు! నాకు లేని ప్రేమ మీకెందుకు?" అన్నది గంగమ్మ.

అదీ నిజమేననుకున్నాడు ఆమె భర్త.

గంగమ్మ ఒక పాత మంచం తెచ్చి తన భర్తకు కూడా బయట వేసింది. గతి లేక ఆమె భర్త దాని మీద పడుకున్నాడు. తన బావమరిదిని పలకరించటానికి మొహం చెల్లక, అతను అనంతయ్యను చూడనట్లు నటించాడు.

ఈ రోజు పండగ. గంగమ్మ చాలా పిండి వంటలు చేసింది. పానకంలో పుడకలాగా అనంతయ్య రాకపోతే భార్యాభర్తలు ఎంతో ఆనందంతో వాటిని తినవలసింది. గంగమ్మ భర్తకు కడుపులో ఎలుకలు గంతులేస్తున్నాయి.

ఒక రాత్రివేళ వచ్చి లేపి భోజనం పెడతానన్నది భార్య. అందుకోసం ఎంతో ఆసక్తిగా నిరీక్షిస్తున్నాడు భర్త.

అనంతయ్యకు నిద్ర పట్టలేదు. తన చెల్లెలి దారిద్ర్యం అతన్ని బాధిస్తున్నది.

గంగమ్మ భర్త తన బావమరిదిని చూసి జాలి పడ్డాడు. అయినా తన భార్యను బయట పెట్టకూడదనుకున్నాడు. చలి జాస్తి అవుతున్నది. గంగమ్మ తన మంచం కింద ఉంచిన కుంపటిని ఆమె భర్త, అనంతయ్య మంచం కిందికి మెల్లగా నెట్టి కొంత తృప్తి పడ్డాడు.

అర్ధరాత్రి దాటింది. గంగమ్మ భర్త నిద్రలో మునిగిపోయాడు. అనంతయ్యకు మాత్రం నిద్ర పట్టలేదు. ఇంతలో గంగమ్మ నీడలాగా కదులుతూ మంచాల దగ్గరికి వచ్చింది. మంచాల కింద తడిమి, కుంపటి ఉన్న మంచం మీద ఉన్నది తన భర్తే అనుకుని, "భోజనానికి రా," అని నెమ్మదిగా చెప్పి, లోపలికి వెళ్ళిపోయింది.

అనంతయ్యకు తన చెల్లెలి ప్రవర్తన అర్థం కాలేదు; తన భర్తకు భయపడి ఆమె తనకు రహస్యంగా భోజనం పెట్టుతున్నదనుకున్నాడు. అతను తన దుప్పటి కప్పుకుని నెమ్మదిగా లోపలికి వెళ్ళాడు.

పిండి వంటలతో సహా భోజనం వడ్డించి సిద్ధంగా వుంది. దీపం వెలుతురు మసక మసకగా ఉంది.

"భోజనం చెయ్యి. ఇంకేమన్నా కావాలంటే ఆ పక్కన కుండల్లో ఉన్నాయి, కావలసినన్ని తీసుకో," అని గంగమ్మ అవతలికి వెళ్ళిపోయింది. దుప్పటి కప్పుకుని వచ్చినవాడు తన భర్తే అనుకున్నదామె. భర్త మంచం చీకట్లో తెలియగలందులకు ఆమె కుంపటి ఉంచింది. ఆ సంగతి ఆమె తన భర్తకు చెప్పలేదు. ఆమె తిన్నగా వెళ్ళి గుమ్మం వద్ద కాపలా కూర్చున్నది.

తన చెల్లెలు ఎంతో ప్రేమతో పెట్టిన భోజనం గదా అని అనంతయ్య కడుపు నిండా తిని, చెయ్యి కడుక్కున్నాడు. కుండల్లో నుంచి తనకు కావలిసినంత తీసుకోమన్నది గదా అని, తన దుప్పటి పరిచి, ఆమె చూపిన కుండలను అందులో బోర్లించాడు. అందులో బియ్యమూ, పిండి వంటలూ, ఇంకేవేవో ఉన్నాయి. అన్నిటినీ మూట గట్టుకుని, అనంతయ్య తన చెల్లెలిని కేక వేస్తే బావగారు లేస్తాడని భయపడి, దొడ్డి దారిన బయటికి వచ్చి, సంతోషంగా ఇంటి దారి పట్టాడు.

మరి కాస్సేపటికి గంగమ్మ భర్త నిద్రలేచి, తన భార్య భోజనానికి పిలవనందుకు మండిపడి, "ఒసే, భోజనమేదే?" అని కేక పెట్టాడు.

"భోజనం చేస్తివిగా? ఇంకా ఏమిటా కేకలు?" అన్నది గుమ్మంలో కూర్చున్న గంగమ్మ.

భర్త మరింత మండిపడి గంగమ్మను నాలుగు తన్నాడు.

జరిగిన మోసం బయటపడింది.

"అసలు నువ్వు కుంపటి ఎందుకు మార్చాలి?" అన్నది గంగమ్మ.

"నా ఇష్టం. సొంత అన్నకు తిండి పెట్టని దానివి, రేపు నావాళ్ళు వస్తే కూడా ఇంతే చేస్తావు. పో, బయటికి," అని భర్త గంగమ్మను బయటికి గెంటి తలుపేసుకున్నాడు.

అనంతయ్య తన చెల్లెలు ఇంటి నుంచి తెచ్చుకున్న బియ్యంలో రూపాయలుండటం చూసి, తన చెల్లెలి ప్రేమను తెగ మెచ్చుకుని, ఆ డబ్బుతో బండీ, ఎడ్లూ కొని సంతోషంగా ఉన్నాడు.



# వార్తలలో బాలలు

## బాలరాయబారులు!

జపానులోని ఫ్యుకోకా నగరంలో గత జూలై 24 నుంచి అగస్టు 4వ తేదీ వరకు ఐదవ 'ఆసియా - పసిఫిక్ బాలల మహాసభలు' జరిగాయి. ఆ సభలలో 40 దేశాల నుంచి 300 మంది బాలబాలికలు పాల్గొన్నారు. ఆ సమావేశాలను 'జూనియర్ ఛాంబర్ ఇంటర్నేషనల్' సంస్థ ఏర్పాటు చేసింది. ప్రపంచ దేశాలలోని 'జేసీ'ల పిల్లలు ఆ సమావేశాలలో పాల్గొన్నారు. మన దేశం నుంచి వెళ్ళిన ఎనిమిది మంది బాలల బృందానికి మద్రాసుకు చెందినపన్నెండేళ్ళ వి.గణేశరత్నం నాయకత్వం వహించాడు. గణేశరత్నం మద్రాసు మొగప్పేర్‌లోని డి.ఏ.వి. పాఠశాలలో 8వ తరగతి చదువుతున్నాడు.

సమావేశాల నుంచి తిరిగివచ్చిన వెంటనే గణేశరత్నం మన 'చందమామ' కార్యాలయానికి వచ్చి, అల్బమ్ చూపి తన జపాను అనుభవాలను ఉత్సాహంగా వివరించాడు.

గణేశరత్నంతో పాటు వెళ్ళిన ఏడుగురు మిత్రులూ ఒక జపాను కుటుంబంలో విడిది చేశారు. వీళ్ళకు ఒకటి రెండు జపాను భాషా పదాలు, వాళ్ళకు కొన్ని ఇంగ్లీషు మాటలు తప్ప మరేమీ రాదు. 'అయితే మాత్రం ఏం? సైగలతోనే హాయిగా మా పనులు చేసుకున్నాం,' అన్నాడా కుర్రాడు. సమావేశాలకు హాజరయిన పిల్లలు ఆయా దేశాలకు ప్రత్యేకమైన జానపద నృత్యాల వంటి సాంస్కృతిక కార్యక్రమాలను ప్రదర్శించారు. ఆయా దేశాల సాంప్రదాయ దుస్తులుధరించి ఒకనాడు వచ్చారు. గణేశరత్నం దుస్తులు చాలా



నిరాడంబరంగా కనిపించాయి. (చిత్రంలో ఉన్నది ఆ ఫోటోనే) ఒకరోజు ఇకెబేనా, జూడో, ఓరిగ్మీ వంటి క్రీడల ఆధార సూత్రాలను నేర్చారు. ఇక వినోదయాత్ర లంటారా? "గ్రీన్‌ల్యాండ్స్,' 'అమ్యూజ్‌మెంట్ పార్క్', 'మెరీన్‌ల్యాండ్స్', 'స్పేస్ వరల్డ్', 'మ్యూజియమ్', 'డాల్ఫిన్ షో' మొదలైన వాటిని చూశాము. బుల్లెట్ ట్రెయిన్‌లో ప్రయాణం చేశాము," అని చెప్పాడు గణేశరత్నం.

సమావేశం ఆఖరి రోజున ఆమోదించిన తీర్మానం గురించిన జ్ఞాపకం గణేశరత్నం మనసులో ఇంకా చెక్కుచెదరకుండా ఉన్నది: "బాలరాయబారులమైన మేము, అందమైన ఈ భూమిని ముందు తరాల కోసం రక్షించగలమని



ప్రమాణం చేస్తున్నాము. మా మాతృదేశాల అందచందాలనూ, సంస్కృతులనూ పరస్పరం పంచుకోవడానికి ఇక్కడ సమావేశమయ్యాము. దేశ సరిహద్దులను అధిగమించి, ఈరోజు మిత్రులతో కలిసి ప్రపంచ భవిష్యత్తు కోసం మా అభిప్రాయాలనూ, అనుభవాలనూ ఒకరితో ఒకరు పంచుకుంటున్నాము. మా జీవన తీరాలను శాంతి, స్నేహ తరంగాలు స్పృశిస్తున్న అనుభూతి చెందుతున్నాము. ప్రపంచంలో శాశ్వతమైన శాంతి నెలకొనడానికి మా స్నేహ బంధాలను పటిష్ఠం చేసుకుంటున్నాము." "భూమి అనే 'అంతరిక్షనౌకను' నడపగల అద్భుతమైన సారథులు ఈ బాలలు. వీరిలో కొందరు మునుముందు నాయకులై ప్రపంచ శాంతిని నెలకొల్ప గల ధీరులు కూడా ఉన్నారు!" అని ఆ సమావేశం పేర్కొన్నది. అరుదైన అవకాశాన్ని సద్వినియోగం చేసుకుని ఆ సమావేశాలలో పాల్గొన్న గణేశరత్నాన్ని అభినందిస్తున్నాము. మునుముందు మరిన్ని విజయాలు సాధించాలని ఆశిస్తూ, శుభాకాంక్షలు అందజేస్తున్నాము.

## నాలుగేళ్ళ కారు డ్రైవర్!



డ్రైవర్ సీట్లో కూర్చుని, స్టీరింగ్ పట్టుకుని తిప్పుతూ కారు నడపడానికి ఉత్సాహపడని పిల్లలంటూ ఉండరు. అటువంటి వారిలో హైదరాబాదుకు చెందిన చిన్నారి జూహీ అగర్వాల్ ఒకతె. ఇవాళ ఆ పాప కారులో ఒంటరిగా కూర్చుని స్టీరింగ్ పట్టుకుని, స్టార్ట్ చేసి, హాయిగా నడుపుకుంటూ వెళ్ళగలదు. ఇంతకూ ఆ పాప వయసు" నాలుగేళ్ళే! అదీ విశేషం! జూహీకి బొమ్మలంటే ప్రాణం. అందులోనూ 'రిమోట్ కంట్రోల్'గల బొమ్మల పట్ల ఆ పాపాయి చూపిన ఆసక్తిని పసికట్టిన ఆమె తల్లిదండ్రులు ఆమెకు డ్రైవింగ్ నేర్పాలని నిర్ణయించారు. ఆమెను డ్రైవింగ్ స్కూల్లో చేర్పించారు. స్టీరింగ్ పట్టడం, గియర్ మార్చడం ఆమె త్వరగా నేర్చుకున్నది. ఆ తరవాత ట్రాఫిక్ రూల్స్, సిగ్నల్స్ గురించి నేర్చుకున్నది. ఇప్పుడామె ఒంటరిగా కారు నడపగలుగుతున్నది! పెద్దయ్యాక తల్లిని కారులో చాలాదూరం తీసుకువెళ్ళాలన్నది జూహీ ఆశ. ప్రమోద్‌కుమార్ - వనిత దంపతుల కూతురయిన జూహీ మూడేళ్ళు నిండక ముందే ఈత నేర్చుకున్నది. ఇప్పుడు పన్నెండు అడుగుల ఎత్తు నుంచి నీళ్ళలోకి దూక కలుగుతున్నది!



పిల్లలకు మరొక సంతోషకరమైన వార్త! మైసూరు విశ్వవిద్యాలయానికి చెందిన ఒక మెకానికల్ ఇంజనీరు పిల్లలకని ప్రత్యేకంగా ఒక కారు నిర్మించాడు. 'టాయ్‌మోటో' అనే ఆ కారు 35 సి.సి. పెట్రోలు ఇంజనుతో నడుస్తుంది. 85 కి.గ్రా. బరువును తీసుకెళుతుంది. దీని ధర దాదాపు 15,000 రూపాయలు.



# కలుపుగోలుతనం

సింగవరంలో సంపన్నరైతు చంద్రయ్య, తన ఒక్కగానొక్క కూతురు సుమతి వివాహం త్వరగా జరిపించాలన్న ఆలోచనలో వున్నాడు. తన దూరపుబంధువు శేషగిరి కొడుకు నరేంద్రుడు, ఆమెకు అన్నివిధాలా తగిన వరుడని చంద్రయ్య అభిప్రాయం. కాని, నరేంద్రుడు సామాన్య కుటుంబీకుడు. చంద్రయ్యదే రెండెకరాల పొలం కౌలుకు తీసుకుని వ్యవసాయం చేస్తూ, తల్లిదండ్రులను పోషించుకుంటున్నాడు.

కూతురు పెళ్ళి ప్రస్తావన వచ్చినప్పుడు, చంద్రయ్య భార్య పార్వతమ్మ, "మన పొలం కౌలు మీద వచ్చే ఆదాయంతో బతికే నరేంద్రుడికి, అమ్మాయిని కట్టబెట్టాలని మీరెందుకాలోచిస్తున్నారో, నా కర్థం కావడం లేదు. నా స్నేహితురాలు దుర్గాంబ కొడుకు వీర్రాజు మంచి అందగాడు, మనలాగే పెద్ద ఆస్తిపరుడు. ఆ సంబంధం అయితే, మన అంతస్థుకు అన్ని విధాలా తగిన విధంగా వుంటుంది," అన్నది.

చంద్రయ్య, భార్య మాటలకు విసుగుపడుతూ, "నరేంద్రుడేం అనాకారికాదు. ఆస్తి మాటకొస్తే మన ఆస్తిపాస్తులు మన అమ్మాయివే గదా! భార్యాభర్తలంటే కాడికి కట్టిన ఎద్దుల జతలాంటివాళ్ళు. వాళ్ళ మధ్య వుండవలసింది ముఖ్యంగా కలుపుగోలుతనం! నరేంద్రుడి నడవడీ, ఇతరులతో అతడు వ్యవహరించే పద్ధతీ చూశాకనే, అతడు అమ్మాయికి తగిన జోడీ అవుతాడన్న నమ్మకం కలిగింది," అన్నాడు.

"నా స్నేహితురాలి కొడుకు వీర్రాజు, కలుపుగోలుతనం అంటే తెలియనంత అమాయకుడూ, అనాగరీకుడూ అనా మీ ఉద్దేశం?" అంటూ రుసరుసలాడింది పార్వతమ్మ.

దీనికి చంద్రయ్య చిన్నగా నవ్వి, "నేనలా అనలేదు. సరే, నరేంద్రుణ్ణీ, వీర్రాజునూ

సాయిరాం ప్రసాద్

పరీక్షించాకే ఎవరికి అమ్మాయి నివ్వాలో తేల్చు కుందాం. ఇది నీకు ఇష్టమే గదా?" అని అడిగాడు.

పార్వతమ్మ ఇష్టమేనన్నట్టు తలాడించింది.

మర్నాడు చంద్రయ్య, వీర్రాజును పిలిచి, పక్కఊళ్ళో జరిగే సంతనుంచి, ఒక మంచి ఎద్ల జతను ఎంపిక చేసి కొని తోలుకురమ్మని డబ్బిచ్చి, "చూడు, బాబూ! ఎద్దుల మధ్య మంచి కలుపుగోలుతనం వుండాలి. అలాకాక పోతే మన వ్యవసాయప్పనులకు పనికిరావు. జాగ్రత్తగా చూసి మరీ కొనుక్కురా!" అని హెచ్చరించి పంపాడు.

వీర్రాజు సూర్యోదయంతోనే లేచి, సంతకు వెళ్ళాడు. అక్కడ చాలా ఎద్ల జతలు అమ్మకానికున్నవి. వాడు వాటిని పరీక్షగా చూస్తూ చాలాసేపు తిరిగి చివరకు, ఎద్లను అమ్మజూపిన ప్రతి బేరగాణ్ణీ, "ఎద్లకేం, చూడడానికి చాలా ముచ్చటగా వున్నవి. అయితే, ఈ ఎద్దుల మధ్య కలుపుగోలుతనం వున్నదా? అలా వుంటేనే, నేను బేరం చేసి కొంటాను!" అని అడగసాగాడు.

బేరగాళ్ళు, వీర్రాజు మాటలు విని, "ఇతడు ఎద్లను కొనడానికి వచ్చాడా? లేక మతి చలించిన మనిషా?" అనుకుంటూ తమలో తాము నవ్వుకోసాగారు.

వీర్రాజు, మధ్యాహ్న భోజనం వేళకల్లా చంద్రయ్య దగ్గిరకు తిరిగి వచ్చి, "సంతలో అమ్మకానికి వచ్చిన ఎద్లు చాలా వున్నవి. కాని, కలుపుగోలుతనం వున్న ఎద్ల జత కావాలని నేను, బేరగాళ్ళనడిగితే, వాళ్ళు నా



కేసి వింత పడుతున్నట్టు చూడడం మొదలు పెట్టారు. నాకు తల తీసేసినట్టయింది! మర్యాద తెలియని అలాంటి వాళ్ళతో ఎడ్ల బేరమేమిటని అక్కణ్ణించి తిరిగివచ్చాను," అని చెప్పాడు.

ఆ తర్వాత చంద్రయ్య, నరేంద్రుడికి కబురు పంపి, వీర్రాజుకు చెప్పినట్టే చెప్పి సంతకు పంపాడు.

ఆ సాయంత్రమే నరేంద్రుడు, ఈడూ జోడూ తోపాటు చూడ ముచ్చటగా వున్న ఒక ఎడ్ల జతను సంతనుంచి తోలుకువచ్చి, చంద్రయ్య వాకిటి ముందు నిలబెట్టాడు.

చంద్రయ్య వాటిని చూసి తృప్తిగా తలా డించి, "ఎడ్లయితే భేషుగ్గా వున్నాయి. కాని, ఇవి కలుపుగోలుగా బండిని లాగగలవని నీ కెలా తెలుసు?" అని అడిగాడు.

"ఆ సంగతి తెలుసుకున్నాకే, వీటిని బేర మాడి కొని తోలుకువచ్చాను," అన్నాడు నరేంద్రుడు.

వీధిగుమ్మంలో నిలబడి, ఈ సంభాషణ అంతా వింటున్న పార్వతమ్మ వేళాకోళం చేస్తున్నట్టు, అది ఎలా తెలుసుకున్నావో మా చెవిని వేస్తే, విని సంతోషిస్తాం!" అన్నది.

ఇందుకునరేంద్రుడు, "కొనబోయే ముందు కాడికి రెండు ఎడ్లనూ కట్టి చర్నాకోలుతో, ఒక దాన్ని అదిలించాను. అది కదిలిన క్షణానే రెండోది కూడా కదిలి బండిని ముందుకు లాగింది. వాటి మధ్య కలుపుగోలుతనం అంటే ఇదేగదా!" అని ఎడ్లను పాకలో కట్టెయ్య డానికి తోలుకు వెళ్ళాడు.

గొడ్లపాక కేసి వెళుతున్న నరేంద్రుడికేసి ఎంతో మెచ్చుకోలుగా చూస్తున్న పార్వతమ్మతో, చంద్రయ్య, "చూశావా మరి, వీర్రాజుకీ, నరేంద్రుడికీ వున్న తేడా? మాటలకు అర్థం తెలియని వాడంటూ ఎవడూ వుండడు. కాని, సందర్భాన్ని బట్టి నరేంద్రుడు నెగ్గు కొచ్చాడు. వీర్రాజు చిత్తుగా ఓడిపోయాడు," అన్నాడు.

"ఆ మాత్రం గ్రహించలేనా ఏమిటి! అమ్మా యికి నరేంద్రుడి చేత ఆ మూడుముళ్ళూ త్వరలో వేయించండి," అన్నది పార్వతమ్మ సంతోషంగా.



# ప్రకృతి వింతలు:



## తేనెటీగ శిలాజం

ఐదు కోట్ల సంవత్సరాలకు పూర్వం తేనెటీగ ఉన్నదా? ఉన్నదనే చెబుతున్నారు జర్మనీకి చెందిన పురాతత్వ శాస్త్రవేత్తలు. ఈఫెల్ ప్రాంతంలో ఒక రాతిపొర మధ్య లభించిన చిన్న తేనెటీగ శిలాజాన్ని దీనికి ఆధారంగా చెబుతున్నారు వాళ్ళు. ఈ శిలాజమే ప్రపంచంలో కెల్లా చాలా ప్రాచీనమైనదని వాళ్ళు అభిప్రాయ పడుతున్నారు. 9 మి.మీ. పొడవుగల ఆ ఈగ శిలాజం కొద్ది తేడాతో ఈనాటి అభివృద్ధి చెందిన తేనెటీగలాగే ఉన్నది!



## రాక్షస బల్లి గుడ్లు!

చైనాలో 7 కోట్ల 50 లక్షల సంవత్సరాలకు పూర్వం నాటి రాక్షసబల్లుల (డినోజార్) గుడ్లూ, అమెరికాలో 14 కోట్ల 50 సంవత్సరాలకు పూర్వం రోజుల నాటి రాక్షసబల్లుల గుడ్లూ కనుగొన్నారు, చైనాలో హెనాన్ సమీపంలో లభించిన ఒక జత గుడ్లను జర్మనీలోని హనోవర్ పరిశోధన సంస్థకు పంపారు. అక్కడ ఆ గుడ్లలోపల శిలాజంగా మారిన పిండాలు ఉన్నాయేమోనని పరిశోధనలు జరుపుతున్నారు. అమెరికా డెన్వర్ సమీపంలో లభించిన పగిలిన గుడ్డు పెంకు లోపలి భాగంలో శిలాజంగా మారిన పిండంగానీ, సొనగానీ ఉన్నట్టు పరిశోధనల ద్వారా తెలియవచ్చింది. అంతకు పూర్వం కాలరోడో ప్రాంతంలో ఇలాంటివే ఆరు గుడ్ల పైపెంకులు లభించాయి. ఉటాలో లభించిన రాక్షసబల్లి గుడ్డు పరిమాణంలో కోడి గుడ్డు కన్నా కాస్త పెద్దదిగా ఉన్నది.



## తమిళనాడులో 'పండ్లగబ్బిలం!'

గిన్నిస్ బుక్ ప్రకారం ప్రపంచంలో అరుదైన మూడు రకాల గబ్బిలాలలో, పండ్లగబ్బిలం, ఒకటి. నలభై అయిదు సంవత్సరాలకు పూర్వం ఎ.ఎఫ్. హాటన్ అనే ఒక పక్షి శాస్త్రజ్ఞుడు తమిళనాడు పడమటి కొండలలో ఈ పండ్లగబ్బిలాన్ని చూసి దాన్ని 'బొంబాయి నేచురల్ హిస్టరీ సొసైటీ'కి, తీసుకువెళ్ళాడు. అక్కడ దానిని పరిశీలించిన శాస్త్రజ్ఞులు అది చాలా అరుదైన జాతికి చెందినదని దానికి సుప్రసిద్ధ పక్షిశాస్త్రజ్ఞుడు డా॥ సలీం అలీ పేరు పెట్టారు. ఈ సంవత్సరం బొంబాయి సంస్థకు చెందిన ఒక శాస్త్రజ్ఞుడూ, ఇంగ్లాండు హారిసన్ జూవలాజికల్ మ్యూజియంకు చెందిన ఒక శాస్త్రజ్ఞుడూ ఒక పండ్లగబ్బిలాన్ని తమిళనాడులో అదే ప్రాంతంలో కనుగొన్నారు. ఈ రెండు సంస్థలూ గబ్బిలాల గురించి పరిశోధనలు జరుపుతున్నాయి.

Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!










It's time to go back to school again. Time for text books. Time for games. Time to meet old friends. And make new ones. Time to start studying again. Because there's so much to learn about the world around you.

From all of us here at Chandamama, have a great year in school. And remember to tell us what you've learnt everyday, when you come home from school !








HANDAMAMA
OLLECTION

ARTIG1246

OCTOBER - 93

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1993 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

*పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) *అక్టోబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. *మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. *వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఇద్దరిదీ వీడని బంధం!

రెండవ ఫోటో : ఇందులో బంధిస్తే అందం!!

పంపినవారు : వి. వాణికృష్ణ 1-10-5 అశోక్ నగర్, హైదరాబాదు - 500 020 (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**



**The stories, articles and designs contained herein are the exclusive property of the Publishers and copying or adapting them in any manner will be dealt with according to law.**